శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః







# సాంప్రదాయిక వ్యాస మాలిక- ౨౨

19-08-2023



శ్రీ సీతారామచంద్ర స్వామి, రామతీర్థం



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అప్పగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు




శ్రీ భగవద్రామనుజులు వారు



శ్రీ మణవాళమామునులు

# విషయసూచిక

# 1. శ్రీరామాయణభూషణవైభవమ్

శ్రీరామాయణదివ్యకావ్యఘటితజ్ఞేయార్థవేత్తా ఽ, తులం
భవ్యం భూషణసంజ్ఞితం విరచయన్ వ్యాఖ్యాన మత్యద్భుతమ్,
ప్రోచే విజ్ఞమనోహరాణి నితరాం గోవిందరాజో మహాన్
తత్త్వాన్యార్యపరంపరాకలితయా ఽ పూర్వాణి సర్వాత్మనా.

(శ్రీరామాయణం అనే దివ్యకావ్యంలో తెలుసుకోదగిన అర్థాలను తెలిసికొన్న మహానుభావులైన గోవిందరాజులు అనే పండితులు సాటి లేని, అందమైన, ఆశ్చర్యకరమైన, భూషణం అనే పేరు కలిగిన వ్యాఖ్యానాన్ని రచించి, పండితుల మనసులకు మిక్కిలిగా ఆనందాన్ని కలిగించే తత్త్వాలను వివరించారు. ఈ అర్థాలు పూర్వాచార్య పరంపరా ప్రాప్తాలు అయినందున పూర్తిగా అపూర్వమైనవి. )

వైదిక సిద్ధాంతాలు అన్నిటిలో, వేదాల తరువాత, ఆ వేదాలతో ఇంచుమించుగా సమానమైన ప్రమాణ గ్రంథంగా పరిగణింపబడే గ్రంథం శ్రీరామాయణం. "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా" (వేదంలో పరతత్త్వంగా తెలియబడే శ్రీమన్నారాయణుడు దశరథ పుత్రుడై జన్మించగా, వేదం కూడా వాల్మీకి ద్వారా శ్రీరామాయణ రూపంలో అవతరించింది) అనే ప్రసిద్ధమైన సూక్తి శ్రీరామాయణం వేదానికి ప్రతిరూపమని తెలియజేస్తున్నది. ప్రస్థానత్రయంగా పరిగణింపబడే ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలు– అనే మూడిటికి ఆయా వైదిక సిద్ధాంతాలకు అనుగుణంగా భాష్యాలు వెలసినట్లే, శ్రీరామాయణానికి కూడా, ద్వైతాద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతాలకు అనుగుణంగా వ్యాఖ్యానాలు వెలువడడం ప్రమాణాలలో శ్రీరామాయణానికి గల ప్రాధాన్యాన్ని నిరూపిస్తున్నది. ఈ విధంగా విశిష్టాద్వైత సిద్ధాంతానికి అనుగుణంగా గోవిందరాజులు అనే పండితులు వెలగించిన అద్భుతమైన వ్యాఖ్యానమే గోవిందరాజీయవ్యాఖ్యానం. దీనికి శ్రీరామాయణభూషణం అని పేరు.

వ్యాఖ్యాత గోవిందరాజులకు సంబంధించిన వ్యక్తిగత విశేషాలు మనకు చాలా క్లుప్తంగానే లభిస్తున్నాయి. అవి కూడా ఆ వ్యాఖ్యానంలో గోవిందరాజులు ప్రతి కాండ వ్యాఖ్యానం ఆరంభంలో రచించిన ఉపోద్ఘాత శ్లోకాలలో ప్రస్తావించిన అంశాలను బట్టి తెలుస్తున్నాయి. వీరు కౌశిక గోత్రులని, వరదాచార్యుల పుత్రులని, అహోబిలం మఠానికి చెందిన శఠకోపయతిని ఆశ్రయించి వేదాంత విద్యలను అభ్యసించారని వ్యాఖ్యానారంభంలోని శ్లోకాలు తెలుపుతున్నాయి. యుద్ధకాండ చివరలో "భావనాచార్య

ప్రేమ్ణైవ ప్రేర్యమాణః" అని అన్నందున తన మిత్రులైన భావనాచార్యులవారి ప్రేరణ కూడా ఈ వ్యాఖ్యాన రచనకు దోహద పడిందని తెలుస్తున్నది.

శ్రీరామాయణభూషణ వ్యాఖ్యానరచనకు ప్రేరకమైన ఒకానొక సందర్భాన్ని వ్యాఖ్యాత వ్యాఖ్యానం ఆరంభంలో ప్రస్తావించారు. ఒక పర్యాయం తాము తిరుమలకు వెళ్ళి, శ్రీవేంకటేశ్వరుని దర్శించిన సమయంలో, అక్కడ శ్రీరామానుజుల సన్నిధిలో పలుదేశాల నుండి వచ్చిన పండితులు తమను శ్రీరామాయణానికి వ్యాఖ్యానాన్ని సంతరించమని ఆదేశించినట్లుగా కలిగిన స్వప్నమే తమను ఈ వ్యాఖ్యానాన్ని రచించేటట్లు ప్రేరేపించింది– అని బాలకాండ వ్యాఖ్యానారంభంలో శ్రీ గోవిందరాజులు పేర్కొన్నారు.

భగవద్రామానుజులు తమ మేనమామ అయిన తిరుమల నంబి అనేఆచార్యుల సన్నిధిలో అలిపిరి పాదాల మండపం దగ్గర ఒక సంవత్సర కాలం పాటు శ్రీరామాయణంలోని అపూర్వమైన సంప్రదాయ రహస్యార్థాలను శ్రవణం చేసినట్లుగా వారి చరిత్ర తెలుపుతూ ఉన్నది. ఈ అర్థాలను తరువాత కాలంలో శ్రీ వైష్ణవ సంప్రదాయానికి చెందిన పూర్వాచార్యులు అనేకులు తాము రచించిన సందర్భాలలో ప్రస్తావించారు. వీటిని అన్నిటిని సమీకరించి ఆయా శ్లోకాల వ్యాఖ్యాన సందర్భంగా అందంగా గోవిందరాజులు గూర్చి శ్రీరామాయణ భూషణం అనే పేరుతో తమ వ్యాఖ్యగా అందించారని భావించవచ్చు. అంతేకాక, ఈ వ్యాఖ్యానంలో గోవిందరాజులు ప్రస్తావించిన అంశాలు శ్రీవైష్ణవ పూర్వాచార్య పరంపర ప్రాప్తాలని కూడా మనం భావించవచ్చు. తాము ఈ వ్యాఖ్యానానికి భూషణం అనే పేరును పెట్టినదానికి అనుగుణంగానే వీరు తమ వ్యాఖ్యానం ఆరంభంలో " పూర్వాచార్య కృత ప్రబంధ జలధేః తాత్పర్యరత్నావళీః గ్రాహం గ్రాహం ––– శ్రీరామాయణభూషణం విరచయే" అని పలికిన వాక్యమే సాక్షి. ఈ వ్యాఖ్యాన రచన తిరుమల కొండపై శ్రీవేంకటేశ్వరుని సన్నిధికి ఎదురుగా ఉండే బేడి ఆంజనేయ స్వామి ఆలయానికి అభిముఖంగా ఉన్న ముఖ మండపంలో జరిగిందని పెద్దలు అంటారు.

గోవిందరాజులు క్రీస్తు శకం 16వ శతాబ్దినాటి వారని, కృష్ణదేవరాయలకు సమకాలీనులు కావచ్చునని తమ సంస్కృత సాహిత్య చరిత్రలో శ్రీమాన్ ఎం. కృష్ణమాచార్యులవారు అభిప్రాయపడ్డారు. ఈ విధమైన చారిత్రక సంప్రదాయ నేపథ్యంలో గోవిందరాజీయ వ్యాఖ్యానం ఆవిర్భవించింది. విశిష్టాద్వైత సిద్ధాంత తత్వాలను శ్రీరామాయణాన్ని ఆధారంగా చేసుకుని నిరూపించడమే ఈ శ్రీరామాయణభూషణ వ్యాఖ్యాన రచనలోని ముఖ్యమైన ఉద్దేశం–– అనే విషయం దీనివల్ల స్పష్టమవుతున్నది.

శ్రీరామాయణభూషణం అని ఈ వ్యాఖ్యానానికి పెట్టబడిన పేరు కూడా ఈ అంశాన్ని ధ్రువీకరిస్తున్నది. విశిష్టాద్వైత సిద్ధాంతంలో పరమాత్మ శ్రీమన్నారాయణుడు దివ్యమంగళ విగ్రహుడు, దివ్యాభరణభూషితుడు, ఉభయ విభూతి నాయకుడు. ఈ అంశాలన్నిటిని వ్యాఖ్యాత శ్రీ రామాయణ భూషణంవాఖ్యానంలో, ఒక్కొక్క కాండ వ్యాఖ్యానానికి ఒక్కొక్క పేరును పెట్టడం ద్వారా వ్యక్తం చేయడం గమనించాలి. ఈ విధంగా వ్యాఖ్యాన నామకరణం ద్వారా కూడా శ్రీగోవిందరాజులు విశిష్టాద్వైత తత్వార్థాలను ఆవిష్కరించారు.

ఏ కావ్యంలో అయినా, ఆ కావ్య నాయనకు ఉదాత్తమైన స్వరూపం మన మనసులో ఆ కావ్య వాఙ్మయం ద్వారా సాక్షాత్కరిస్తుంది. ఆ కావ్య నాయకుని సన్నిధానం లేకపోయినాప్పటికీ. అతని యశోరూపం ఆ కావ్యం ఉన్నంతవరకు అజరామరంగా నిలచి ఉంటుంది. " తేషా మసన్నిధానే ౽ పి న స్వయం, పశ్య, నశ్యతి" అని ఈ విషయాన్ని దండి మహాకవి కూడా కావ్యాదర్శంలో అన్నాడు. శ్రీరామాయణంలో వాల్మీకి శ్రీమన్నారాయణుని అవతార విశేషమైన శ్రీరామచంద్రుని దివ్య మంగళరూపాన్ని, ఆ స్వామి స్వరూప స్వభావాన్ని రస రమ్యంగా చిత్రీకరించాడు కదా. వానిని గోవిందరాజులు తమ చక్కని ఈ భూషణ వ్యాఖ్యానం ద్వారా అలంకరించి, మన మనోవీథిలో మనోహరంగా, స్పష్టంగా ప్రకాశించేటట్లు చేశారు.

ఇక్కడ ఇంకొక ఆలంకారిక శాస్త్ర విశేషాన్ని కూడా గమనించాలి. విద్యానాథుడనే సంస్కృతాలంకారిక శాస్త్రలక్షణకారుడు ప్రతాపరుద్రీయం అనే తన లక్షణ గ్రంథంలో, కావ్య పురుషుని స్వరూపాన్ని "శబ్దార్థౌ మూర్తిరాఖ్యాతౌ జీవితం వ్యంగ్య వైభవమ్" (కావ్యంలోని శబ్దార్థాలే కావ్య పురుషుని రూపం, ఆ కావ్య పురుషుని జీవితం వ్యంగ్యార్థవైభవమే) అని అంటూ నిర్వచించాడు. శబ్దం, అర్థం అనే రెండు కావ్య పురుషునకు శరీరాలని, ఉపమా, అనుప్రాస మొదలైన అలంకారాలు భూషణాలు అని, కాంతి సౌకుమార్యాదులు గుణాలని, ఆత్మ వ్యంగ్యార్థమే అని అన్నాడు. ఈ విధంగా శ్రీరామాయణకావ్యంలో ప్రకాశించే శ్రీరామచంద్రుని దివ్యమంగళ రూపాన్ని తమ వ్యాఖ్యానం ద్వారా భూషించదలచి, గోవిందరాజులు శ్రీరామాయణ భూషణం అనే పేరును తమ వ్యాఖ్యానానికి పెట్టినట్లుగా భావించవచ్చు. వాస్తవంగా ఈ వ్యాఖ్యానం శ్రీరామాయణ కావ్యపురుషునకు ఒక దివ్యమైన, అపూర్వమైన భూషణం అని అనడంలో ఏ సందేహం లేదు.

ఒక వ్యక్తి రూపాన్ని అలంకరించే భూషణాలు ఏ విధంగా ఉంటాయి ?అని గమనిస్తే, అతని పాదాల నుండి శిరస్సు పర్యంతంగా ఉండే అనేకమైన అంగాలను భూషించే ఆభరణాలు అనేక విధాలుగా ఉంటాయి. వాటి పేర్లు కూడా వివిధంగా ఉంటాయి. శ్రీ రామాయణ భూషణ వ్యాఖ్యలో కూడా వ్యాఖ్యాత గోవిందరాజులు ఒక్కొక్క కాండ వ్యాఖ్యానానికి ఒక్కొక్క పేరును పెట్టడం ద్వారా ఆ కాండలో పరమాత్మ దివ్య రూపాన్ని తత్పర్యంతంగా దర్శించదగిన రీతిని సూచించారని భావించవచ్చు.

అయితే, ఈ పేర్లను పెట్టిన క్రమంలో కూడా శాస్త్రీయమైన సాంప్రదాయకమైన విశేషాలు మనకు గోచరిస్తాయి. దేవతలను "ఆపాద మౌళి పర్యంతమ్" అని, "దేవాః చరణతః పునః" అనే విధంగా పాదం నుండి శిరస్సు వరకు దర్శించాలని శాస్త్రం చెబుతున్నది. ఇది శాస్త్రక్రమం. ఈ విధంగా పాదాల నుండి ఆరంభించి, శిరస్సు వరకు పరమాత్మను దర్శించడంలో జీవుని శేషత్వ పారతంత్ర్యాలు వ్యక్తం అవుతాయని శ్రీవైష్ణవ సంప్రదాయం. ఇది సాంప్రదాయిక క్రమం. జ్ఞానం, ఆనందం కంటే శేషత్వం, పారతంత్ర్యం అనేవే జీవుని స్వరూపాన్ని నిష్కర్షించే అంతరంగ నిరూపకాలు– అని శ్రీవైష్ణవ సిద్ధాంత తత్త్వం. ఈ విధంగా బాలకాండ నుండి ఉత్తరకాండ వరకు గల ఏడుకాండల వ్యాఖ్యానానికి, దేహంలో పాదాల నుండి శిరస్సు వరకు గల వేరు వేరు అంగాలను భూషించే ఆభరణాల పేర్లను పెట్టడం ద్వారా గోవిందరాజులు తాము శ్రీరామాయణ కావ్యపురుషుడైన, పరమాత్మ అయిన శ్రీరామచంద్రుని స్వరూపాన్ని దర్శించిన శాస్త్రీయమైన, సాంప్రదాయిఉకమైన క్రమాన్ని కూడా సూచించారు.

బాలకాండ వ్యాఖ్యకు మణిమంజీరమని, అయోధ్యాకాండ వ్యాఖ్యానానికి పీతాంబరమని, ఆరణ్యకాండ వ్యాఖ్యానానికి రత్న మేఖల అని, కిష్కింధాకాండ వ్యాఖ్యకు ముక్తాహారమని, సుందరకాండ వ్యాఖ్యకు తిలకమని, యుద్ధకాండ వ్యాఖ్యకు రత్న కిరీటమని, ఉత్తరకాండ వ్యాఖ్యకు మకుటమని నామకరణం చేయడం కూడా పై అంశాన్ని సూచిస్తున్నది. మంజీరాది మకుట పర్యంతంగా ఉండే భూషణాలు ఆపాదమస్తకం రూపాన్ని భూషిస్తాయి కదా.

మొదటి కాండ అయిన బాలకాండకు గల వ్యాఖ్యానానికి మణిమంజీరం అనే పేరును పెట్టడంలో ఇంకొక విశేషాన్ని కూడా భావించవచ్చు. శ్రీరామాయణం శరణాగతి శాస్త్రంగా ప్రసిద్ధి చెందింది. ఇంచుమించుగా శ్రీరామాయణంలోని అన్ని కాండలలోనూ శరణాగతి సందర్భాలు గోచరించడం వల్ల, ఆయా సందర్భాలలో శరణాగతికి

సంబంధించిన అనేక శాస్త్రీయమైన అంశాలు వ్యక్తమవుతున్నందున, ఈ ప్రసిద్ధి ఏర్పడింది. శరణాగతి అనేది "త్వత్పాదమూలం శరణం ప్రపద్యే" అనే విధంగా పాదాలను ఆశ్రయించడమే కనుక, మొదటి కాండ వ్యాఖ్యకు పాద భూషణమైన మణిమంజీరం పేరును పెట్టడం శరణాగతిశాస్త్రతత్వానుగుణం.

ఒక్కొక్క కాండవ్యాఖ్యకు ఒక్కొక్క విధమైన పేరును పెట్టడంలో కూడా వ్యాఖ్యాత భగవద్రామానుజుల శరణాగతి గద్య సూక్తిని అనుసరించారని భావించవచ్చు. శరణాగతిగద్యలోని ఒక చూర్ణికలో శ్రీరామానుజులు శ్రీమన్నారాయణుని దివ్యాభరణాలను ప్రస్తావిస్తూ, "కిరీటమకుట చూడావతంస మకర కుండల గ్రైవేయక హారకటక ముక్తాదామోదర బంధనకాంచీగుణనూపురాద్యపరిమిత దివ్య భూషణ! " అని అన్నారు ఏడు కాండల వ్యాఖ్యానాలకు పెట్టబడిన ఈ నామాలు అన్ని ఈ చూర్ణికలో గోచరించడం స్పష్టం.

ఇక్కడ ఇంకొక గంభీరమైన, సాంప్రదాయికమైన విశేషం గమనించవలసినది ఉన్నది. యుద్ధకాండ వ్యాఖ్యానానికి రత్నకిరీటమని, ఉత్తరకాండ వ్యాఖ్యానానికి మకుటని పేర్లను వ్యాఖ్యాత పెట్టడాన్ని పైపైన చూసినప్పుడు పునరుక్తి తోస్తుంది. " మకుటం కిరీటం పున్నపుంసకమ్" అని ఈ రెండు పదాలు పర్యాయాలుగా నిఘంటువులలో చూపబడ్డాయికదా. వాస్తవం గమనిస్తే, ఇక్కడ ఆ దోషానికి ప్రసక్తి లేనే లేదు, ఒక అందమైన విశేషాన్ని సూచించడం కోసమే వ్యాఖ్యాత ఈ విధంగా నామకరణాలను చేశారు– అనేది ఈ వైష్ణవ సాంప్రదాయిక పరిజ్ఞానాన్ని కలవారికి మాత్రమే భాసించే, ఒక విలక్షణమైన అంశం. దానిని సంగ్రహంగా ప్రస్తావించడం జరుగుతున్నది.

ఈ రెండు నామాలలో పునరుక్తి భాసిస్తుందే! అనే సందేహాన్ని తీరుస్తూ శ్రీ వేదాంతదేశికులు శరణాగతి గద్య వ్యాఖ్యానంలో "ధారకపురుషభేదేన హి మకుట ద్వైవిధ్యం శిల్పశాస్త్రాది సిద్ధమ్, అథవా, కిరీటస్యోర్ధ్వభాగో మకుటశబ్దేనోచ్యతే " అని అన్నారు. ఇందుచేత, కిరీటం, మకుటం– అనే రెండు ధరించే వ్యక్తుల భేదాన్ని బట్టి అర్థాన్ని చెప్పవచ్చునని, లేక, కిరీటం పై భాగాన్ని మకుట శబ్దం తెలుపుతున్నదని చెప్పవచ్చునని తెలుస్తున్నది.

ముందుగా, ధరించే వ్యక్తుల భేదాన్నిబట్టి కిరీట, మకుట శబ్దాలను అన్వయించవచ్చు –అనే మొదటి సమాధానాన్ని కొంచెం లోతుగా గమనించాలి. శ్రీరామానుజులు తమ సూక్తులలో దివ్యసూరుల ప్రబంధాలలోని మధురమైన భావాలను

అనుసంధించారు, అనుసరించారు– అనే విషయం శ్రీవైష్ణవ సంప్రదాయజ్ఞులు అందరూ ఏకగ్రీవంగా అంగీకరించే విషయం. ప్రస్తుత శరణాగతి గద్య సూక్తి దీనికి ఒక ఉదాహరణం. నమ్మాళ్వారులు తిరువిరుత్తం అనే ప్రబంధంలో ఒకచోట పరమాత్మను " పారళంద పేరరశే! ఎమ్ విశుమ్బరశే! " అని అంటూ భగవంతుని లీలా విభూతి సార్వభౌమత్వాన్ని, నిత్యవిభూతి చక్రవర్తిత్వాన్ని రెండు వేరు వేరు సంబోధనల ద్వారా కీర్తించారు. లీలావిభూతి అంటే –పరమాత్మ లీలకు విషయమైన, పరమపదానికి ఈవలి వైపున ఉన్న బ్రహ్మలోకపర్యంతమైన ఇహలోక సామ్రాజ్యం. నిత్యవిభూతి అంటే– నిత్యంగా ఉండే పరమపద సామ్రాజ్యం. " పారళంద పేరరశే! " అంటే –త్రివిక్రముడై, తన ఒక శ్రీచరణంతో భూమిని కొలచి, " ఇది నా సొత్తు " అని నిరూపించిన లీలావిభూతికి నాయకుడు– అని అర్థం. అందుచేత ఈ సంబోధన లీలావిభూతి నాయకత్వాన్ని తెలుపుతున్నది. " ఎమ్ విశుంబరశే! " అంటే– "నా నిత్యసూరినాథా! " అని అర్థం. అందుచేత, ఈ సంబోధన నిత్యవిభూతి నాయకత్వాన్ని తెలుపుతున్నది. కనుక, శ్రీరామానుజులు శరణాగతి గద్యలో కిరీట శబ్దం ద్వారా భగవంతుని లీలావిభూతినాథత్వాన్ని, మకుట శబ్దం ద్వారా నిత్య విభూతి నాయకత్వాన్ని తెలిపారు– అని గ్రహించాలి. కిరీటం, మకుటం అనేవి "ఆధిరాజ్యమధికం భువనానామ్ ఈశ! తే పిశునయన్ కిల మౌళిః" అనే విధంగా ఆదిరాజ్య సూచకం కదా. ప్రస్తుతంలో కూడా శ్రీరామాయణభూషణకర్త ఈ రెండు నామాలను యుద్ధకాండ, ఉత్తరకాండ వ్యాఖ్యానాలకు పెట్టడం ద్వారా భగవంతుని ఉభయ విభూతినాథత్వాన్ని సూచించారు.

అయితే, ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చు. ఇక్కడ వ్యక్తులు వేరు కాదు కదా. భగవంతుడనే ఒకే వ్యక్తి కదా ఈ రెండిటిని ధరిస్తున్నాడు! – అనే సందేహం తోచవచ్చు. శ్రీమన్నారాయణుడు అనే ధర్మి ఒకడే అయినా, పరవ్యూహ విభవాది భేదంతో భగవంతుని రూపాలను అనేకంగా శాస్త్రం నిర్వచించింది కదా. అందుచేత, దేశికులు పలికిన "ధారకపురుషభేదేన హి మకుట ద్వైవిధ్యం" అనే సమన్వయాన్ని చేయడంలో అడ్డు లేదు.

యుద్ధకాండ ఉత్తరకాండలలోని కథాప్రమేయం ఈ విధమైన ద్వైవిధ్యాన్ని సూచించడం కూడా గమనించాలి. యుద్ధకాండలో చివరిలో జరిగిన పట్టాభిషేకం లీలావిభూతినాథత్వసూచకం. అందువల్ల, ఇది రత్న కిరీ శబ్దంతో తెలుపబడింది. ఉత్తరకాండ చివరిలో పరమ పురుషుడైన శ్రీరాముడు పరమపదాన్ని చేరి అక్కడ సింహాసనంలో వేంచేసి ఉండే సన్నివేశం తెలుపబడినందున, ఇది, మకుటశబ్దంతో సూచింపబడింది. భగవంతుని శేషిత్వపరాకాష్ఠను తెలియజేసే నిత్యవిభూతి నాయకత్వాన్ని

మకుటశబ్దంతో సూచించడం కూడా చాలా యుక్తం. "కిరీటస్యోర్ధ్వభాగో మకుటశబ్దేనోచ్యతే" అనే దేశికుల సూక్తి కూడా ఈ అన్వయానికి అనుగుణం. " వేదవేద్యే" అనే సుప్రసిద్ధ సూక్తికి కూడా అనుగుణమని కూడా చెప్పవచ్చు.

శ్రీరామాయణభూషణం వ్యాఖ్యలోని కొన్ని అంశాలు ప్రస్తావింపబడుతున్నాయి. "కృత్వాత్మానం చతుర్విధమ్" అనే శ్రీ రామాయణ ప్రక్రియానుగుణంగా శ్రీమన్నారాయణుడే శ్రీరామ, లక్ష్మణ, భారత, శత్రుఘ్నుల రూపంలో అవతరించి సామాన్య విశేషధర్మ పరిపాలనను చేశాడు. "రామరూపేణావతీర్య పితృవచనపరిపాలనాది సామాన్యధర్మ మన్వతిష్టత్, లక్ష్మణరూ పేణ భగవచ్చేషత్వరూపం విశేషధర్మం, భరతరూపేణ భగవత్పారతంత్ర్య రూపం, శత్రుఘ్నరూపేణ భాగవతశేషత్వమ్" అనే గోవిందరాజీయ వ్యాఖ్యానసూక్తి ఈ వివరాన్ని తెల్పుతున్నది. ఈ విధమైన వ్యాఖ్యాన ప్రక్రియ మిగిలిన వ్యాఖ్యానాలలో కన్పించదు. ఈ ప్రక్రియకు అనుగుణంగానే "ఆత్మానం మానుషం మన్యే" ఇత్యాది రామవచనాలు, "స్వయం తు రుచిరే దేశే" , "అహం సర్వం కరిష్యే" ఇత్యాది లక్ష్మణవచనాలు, "రాజ్యం చాహం చ రామస్య" ఇత్యాది భరతవచనాలు, "గచ్ఛతా మాతుల కులమ్" ఇత్యాది శత్రుఘ్నునకు సంబంధించిన శ్లోకం వ్యాఖ్యానింపబడడం గమనించవచ్చు. ఈ వివరణం అంతా శ్రీవైష్ణవ సంప్రదాయ తత్త్వానుగుణం.

శ్రీరామాయణంలో వివిధ కాండలలో భగవంతుడైన శ్రీ మన్నారాయణునకు చెందిన పరత్వానుగుణమైన విశేషాలు తెలుపబడిన వైనాన్నికూడా వ్యాఖ్యాత ఆయా కాండల ఆరంభంలో సూచించారు. బాలకాండలో – జగత్కారణత్వ, మహాపురుషత్వ, అచింత్యవైభవత్వాదులను ప్రస్తావించడం ద్వారా సర్వస్మాత్ పరత్వం, అయోధ్యాకాండలో వేదాంతంలో భగవంతునకు ఉభయలింగాలుగా చెప్పబడిన హేయప్రత్యనీకత్వ – కల్యాణైకతానత్వాలు, అరణ్యకాండలో సజ్జనసంరక్షణాదులు, కిష్కింధలో మిత్రసంరక్షణాదులు, సుందరకాండలో సర్వసంహర్తృత్వం, యుద్ధకాండలో ఉపాయకృత్యం తెలుపబడ్డాయని గోవిందరాజీయ వ్యాఖ్యానవివరణం. ఇందువల్ల శ్రీరామాయణం సమగ్రంగా పరతత్త్వ స్వరూప ప్రతిపాదకమని గోవిందరాజీయ వ్యాఖ్యాన హృదయం.

శ్రీరామాయణం శరణాగతి మంత్రార్థ వివరణాత్మకమని సాంప్రదాయిక వివరణం. దీనిని గూర్చి గోవిందరాజులు కిష్కింధాకాండ వ్యాఖ్యానారభంలో ప్రస్తావిస్తూ –

"వస్తుతస్తు – ప్రథమే కాండే శ్రీమత్త్వం, శ్రీమత్పదోదీరిత ముక్త్వా, ద్వితీయే సర్వజన వ్యామోహవిషయత్వోక్త్యా నారాయణశబ్దార్థః తృతీయే పంచవటీవాసపర్యంత వృత్తాంతేన మునిజనకైంకర్యోక్త్యా చతుర్థ్యర్థః, ఖరాదివధవృత్తాంతేన నమశ్శబ్దార్థ ఉక్తః" అని తెలిపారు. దీనివల్ల అరణ్యకాండపర్యంతం ద్వయమంత్రంలోని "శ్రీమతే నారాయణాయ నమ" అని ద్వితీయవాక్యంలోని అర్థం అనుశీలింప బడిందని తెలుస్తున్నది. ఈ క్రమం సాంప్రదాయికం. శరణాగతితత్త్వవివరణాత్మకమైన, శ్రీశఠగోపుల సహస్రగీతిప్రబంధంలో కూడా మొదటి మూడు శతకాలలో ద్వయంలోని – ద్వితీయ వాక్యార్థం తెలుపబడిందనే క్రమాన్ని అనుసరించి గోవిందరాజులు శ్రీరామాయణంలోని మొదటి మూడు కాండలలోని ప్రమేయాన్ని ద్వయోత్తవాక్యార్థ వివరణ రూపమని తెలియజేశారు.

శ్రీరామాయణంలో ప్రణవార్థం సూచింపబడిన సందర్భాన్నికూడా గోవిందరాజీయవ్యాఖ్యానం సూచించింది. "ప్రణవాద్యా స్తథా వేదాః" అని వేదాలన్నీ ప్రణవార్థ రూపాలైనపుడు, ఆ వేదాల ప్రతిరూపమే శ్రీరామాయణమైనపుడు, శ్రీరామాయణంలో ప్రణవార్థం గోచరించడంలో ఆశ్చర్యం లేదు. "అగ్రతః ప్రయయౌ రా" (11–1) అనే అరణ్యకాండలోని శోకంలో ప్రణవార్థం తెలుపబడిందని "అనేన ప్రణవార్థ ఉక్తః" అనే సూక్తి ద్వారా ఈ విషయాన్ని గోవిందరాజులు తెలిపారు. దండకారణ్యాన్ని ప్రవేశించినపుడు రాముడు ముందు, సీత్రాదేవి మధ్యలో, లక్ష్మణుడు చివరలో ప్రయాణం చేయడం ప్రణవం నడచివెళ్ళినట్టున్నదని సోమాశియాండాన్ – అనే శ్రీవైష్ణవాచార్యులొకరు పల్కిన సూక్తిని బట్టి ఈ వివరణం చేయబడింది. అకారం చేత తెలుపబడే భగవంతుడే శ్రీరాముడు, ఉకారంచేత సూచింపబడే పురుషకార స్వరూపిణి, లక్ష్మి సీతాదేవి, మకారంచేత సూచింపబడే జీవుడు – లక్ష్మణుడు.

కనుక వీరు ముగ్గురు ప్రయాణం చేసిన క్రమం ప్రణవంలోని మూడక్షరాల క్రమాన్ని స్మరింపజేస్తున్నదని, అందువల్ల, ప్రణవార్థం నడచివెళ్ళినట్టున్నదని పై వివరణలోని తాత్పర్యం. "అకారః చిత్స్వరూపస్య విష్ణోర్వాచక ఇషష్యతే, ఉకారః చిత్స్వరూపాయా శ్రియో వాచి తథా విదుః, మకారస్తు తయోర్దాస ఇతి ప్రణవలక్షణమ్" అనే పాంచరాత్రసూక్తి ఈ వివరణానికి ప్రమాణం.

బాలకాండలోని 23వ సర్గలో గల "కౌసల్యాసుప్రజా! రామ! " ఇత్యాది శ్లోకంలో విశ్వామిత్రమహర్షి శ్రీరామునకు సుప్రభాతం పలికే సందర్భం గోచరిస్తుంది. ఇక్కడ గోవిందరాజులు "కౌసల్యాసుప్రజా" అనే సంబోధనను వివరిస్తూ "బోధనకాలే

విస్మృతముఖో ముని రాసీత్"  అని అన్నారు. ఈ వివరణం నిశితంగా గమనించదగినది. ఇందులో కొంత పాఠపరిష్కారం చేయవలసిన అక్కర ఉన్నదని కూడా కాంచీ మహావిద్వాన్ ప్రతివాదిభయంకరమ్ అణ్ణంగరాచార్య స్వామి వంటి పెద్దలు సూచించారు. గోదాదేవి రచించిన తిరుప్పావై ప్రబంధంలోని రెండవ పాశురంలో గల "పాఱ్కడలుళ్ పైయిల్ తుయిన్ఱ"  (క్షీరాబ్ధిలో ఆదిశేష శయనంపై తూగే) అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ నాయనార్ అనే శ్రీవైష్ణవ పూర్వాచార్యులు "కౌసల్యా సుప్రజా"  ఇత్యాది శ్లోకాన్ని ప్రమాణీకరించడమే కాక, ఆ శ్లోకాన్ని వ్యాఖ్యానించారు కూడా. ఆ విధంగా వారు వ్యాఖ్యానిస్తూ "కౌసల్యాసుప్రజా "  అనే పదాన్ని "ఉణ్బప్పుక్కువాయె మఱప్పారైప్పోలే, వన్ద కారియత్తై మఱన్దాన్. ఒరు తిరువాట్టి పిళ్ళ ప్పెరుమ్బడియే! – ఎన్గిఱాన్"  అని అన్నారు. ఈ వివరణ తాత్పర్యం ఇది. విశ్వామిత్రుడు శ్రీరాముని నిద్ర లేపాలని వచ్చాడు. శ్రీరాముని స్వాపకాలిక సౌందర్యాన్ని చూడగానే అంతటి ముని పరవశుడయ్యాడు. తన కృత్యాన్ని మఱచి, తనను తాను మఱచి, "ఆహా! ఇతనిని కన్నతల్లి కౌసల్య ఎంత అదృష్టవంతురాలో! " – అని తలచాడు. ఆ భావానికి అనుగుణంగానే "కౌసల్యా సుప్రజారామ! " అని సంబోధించాడు. ఇది ఏవిధంగా ఉన్నది? అంటే, భోజనానికి ఉపక్రమించినవాడొకడు, తనకు ఆకులో వడ్డించిన ఒక అందమైన భక్ష్యాన్ని చూచాడు. ఆ భక్ష్యం ఆకారంలోని అందాన్ని చూచి, "ఆహా! ఇంత అందంగా దీనిని చేసినవారెవరో కదా! " అని ఆశ్చర్యపడి, క్షణకాలం భోజనం చేసే విషయాన్ని మఱచినట్లున్నది – అని పై ద్రావిడ వ్యాఖ్యాన సూక్తి తాత్పర్యం. పై వ్యాఖ్యాన సూక్తిని అనుసరిస్తూ గోవిందరాజులు "భోజనకాలే విస్రృతముఖో మునిరాసీత్"  అని పల్కి ఉంటారు. కాని వ్రాతప్రత్లలో సహజంగా చోటుచేసుకునే దోషాల మూలంగా "భోజన" అనే శబ్దం "బోధన"  అని మాఱి ఉంటుంది. లేకపోతే, తరువాత ఉండే "విస్మృతముఖః"  అనే ప్రయోగానికి సార్థక్యం కుదరదు. అందువల్ల "భోజనకాలే విస్మృతముఖో మునిరాసీత్" అనేదే సరి అయిన పాఠమని శ్రీ అణ్ణఙ్గరాచార్యులవారి అభిప్రాయం. కానీ ఇప్పటికీ వ్యాఖ్యానగ్రంథాలలో "బోధనకాలే"  అని ఉండడం గమనార్హం.

చివరగా ఒక విషయాన్ని ప్రస్తావిస్తాను. అయోధ్యాకాండలో అయోధ్యానగరవాసులు రాముని కల్యాణగుణాలను పొగడుతూ పలికే సందర్భంలో "సత్యేన లోకాన్ జయతి"  (12–29) అని ఉన్నది.

ఇక్కడ వ్యాఖ్యానిస్తూ గోవిందరాజులు ఒక సాంప్రదాయికమైన అపూర్వమైన ఐతిహ్యాన్ని "చోళమహీపతిః కదాచిత్ సన్నిహితం మధ్యమవీథిభట్టారకం ప్రతి 'ఆత్మానం

మానుషం మన్యే' ఇతి వదన్ రామః కథం జటయుషోః మోక్షం దత్తవానితి పప్రచ్ఛ. సోపి, సత్యేన లోకాన్ జయతి – ఇత్యుక్త్వా, మహతీం చ బహుమతి మవాప్తవా నిత్యైతిహ్య మత్ర జ్ఞేయమ్" అనేది ఆ ఐతిహ్యం.

నంబిళ్ళై (వరదరాజులు) అనే పండితులు గొప్ప వ్యాఖ్యాత. వారికి సమకాలీనులు మధ్యమవీథిభట్టారకులనేవారొకరు చోళరాజుతో సన్నిహితంగా మెలిగేవారు. వారు, నమ్బిళ్ళైకీర్తిప్రతిష్టలను విని అసూయపడేవారు. ఒకనాడు చోళరాజు సభలో భట్టారకులను చూచి, "స్వామీ! తనను దశరథపుత్రునిగా "ఆత్మానం మానుషం మన్యే" అనే భావనకు అనుగుణం కాదు కదా! దీనికి మీ సమాధానం ఏమి? అని ప్రశ్నించాడు. భట్టారకులకు వెంటనే తగిన బదులేమీ స్ఫురించలేదు. ఇంతలో రాజు కార్యాంతరంగా అన్యమనస్కుడయ్యాడు. అపుడు భట్టారకులకు సభలో నమ్బిళ్ళై శిష్యులొకరు కన్పించగా, వారిని చూచి "ఈ సందర్భంలో నమ్బిళ్ళై ఏమని బదులిచ్చేవారు?" అని అడిగారు. వెంటనే నమ్బిళ్ళై శిష్యులు "సత్యేన లోకాన్ జయతి" అనే సూక్తితో బదులిచ్చేవారు – అన్నారు. అంటే – శ్రీరాముడు సత్యవాదిత్వగుణంతో లోకాలను అన్నిటిని స్వాధీనంచేసికొన్నందున, పరమపదం కూడా అతనికి అధీనమైనదని, అందువల్ల జటాయువునకు మోక్షం ఇవ్వడంలో అడ్డులేదని దీని భావం. కొంతసేపయిన తర్వాత, తనను మళ్ళీ అడిగిన చోళరాజుకు, నమ్బిళ్ళై శిష్యుల ద్వారా తెలిసిన సమాధానాన్ని భట్టారకులు తేలిపారు. ప్రభువు చాలా సంతోషించి, భట్టారకులను గొప్పగా సమ్మానించాడు. భట్టార కులు ఇంతకాలం తాము నమ్బిళ్ళై పట్ల అపచారపడినందులకు చాలా పశ్చాత్తాపాన్ని పొంది, ఆ ధనం, ఆ గౌరవం అంతా వారికే దక్కాలని తలచి, దానిని అంతటిని నమ్బిళ్ళైకు సమర్పించారు. ఈ ఐతిహ్యమే గోవిందరాజీయ వ్యాఖ్యలో ప్రస్తావించబడింది. ఈ విధమైన, సాంప్రదాయికాలైన రస్యరహస్యార్థ వివరణలు గోవిందరాజీయ వ్యాఖ్యానంలో అడుగడుగునా గోచరిస్తాయి. అందువల్లనే ఈ వ్యాఖ్యానం సదాచార్యుల సన్నిధిలో అధ్యయనం చేయడం అనేది శ్రీవైష్ణవ సంప్రదాయంలో చిరకాలంగా సాగుతున్న క్రమం.

తస్మై గోవిందరాజాయ వ్యాఖ్యాతృమణయే నమః
యోభూషయదాదికావ్యం వ్యాఖ్యయా భూషణాఖ్యయా॥

★★★★★

## 2. భరతవచనాలలో కైకేయిస్వరూపం

శ్రీరామాయణంలో మనకు కనిపించే పలువురు వ్యక్తుల స్వరూప స్వభావాలు చాలా ఆశ్చర్యకరంగా ఉంటాయి. మనకు ఒక సందేశాన్ని అందించేవిగా అవి గోచరిస్తాయి వాటిలో కైకేయి ఒకరు. వాల్మీకి మహర్షి, శ్రీరామాయణంలోని ఆయా వ్యక్తుల స్వరూప స్వభావాలను, కొన్ని కొన్ని సందర్భాలలో తన మాటలతోనూ, మరికొన్ని సందర్భాలలో ఇతర వ్యక్తులు మాట్లాడే మాటల ద్వారాను వ్యక్తం చేస్తాడు. ఆ విధంగా ఒకానొక సందర్భంలో భరతుడు మాట్లాడిన మాటలను బట్టి కైకేయికి కల స్వరూపం ఏమి? దానివల్ల మనకు అందే సందేశం ఏమి? అనే విషయాన్ని సంగ్రహంగా గమనిద్దాం.

సహజంగానే కైకేయి మొండిమనిషి. తనకు అన్నీ తెలుసు –అనే అభిప్రాయాన్ని కలిగినది. ఇతరులు తనకు చెప్పే హితాన్ని వినే స్వభావాన్ని కలిగినది కాదు. తన కుమారుడైన భరతునకు ఏదో మంచిని చేయాలని, చేస్తున్నానని భావించి, అతనికి తీరని అపకారమే చేసింది. దుఃఖాన్ని మిగిల్చింది. 14 సంవత్సరాల పాటు శ్రీరాముడు రాజ్యపాలనను వదిలిపెట్టి, భోగభాగ్యాలను విడిచిపెట్టి, నార బట్టలను కట్టుకొని అరణ్యవాసం చేశాడు, భరతుడు అరణ్యాలకు వెళ్లకుండానే, అన్ని విధాలైన సుఖాలను విడిచిపెట్టి, కాలాన్ని గడపవలసి వచ్చింది. సుమన్త్రుడు, వశిష్ఠుడు మొదలైనవారు ఎంతగా చెప్పినప్పటికీ, ఆమె వారి మాటలను ఏమాత్రం వినిపించుకోలేదు. శ్రీరాముని వనవాసం జరిగి తీరాలి అని పట్టుబట్టింది.

ఈమెకు ఈ విధంగా మనసులో కలతను కలిగించినది, ఈమె మనసును మార్చినది, మంథర. " కలక్కియ మా మనత్తనళాయ్ కైకేశి వరమ్ వేండ, మలక్కియ మా మనత్తనాయ్ మన్నవనుమ్ మఱాదొழியు, కుల క్కుమరా! కాడుఱైయ పో" (కలతను పొందింపబడిన మనస్సును కలిగిన కైకేయి వరాలను వేడగా, ఆ మాటకు కాదనలేని దశరథుడు కూడా శ్రీరాముని వనాలకు వెళ్ళమని చెప్పగా) అని ఆళ్వారులు కూడా అన్నారు. ఈ విధంగా మంథర చెప్పిన మాటలకు మనసులో కలతను పొందిన కైకేయి వరాలను అడిగింది.

అది సరే, మంథర చెప్పిన మాటలను విన్న తరువాత కైకేయి మనసులో కలతను పొందింది అంటే, అంతకుముందు ఆమె మనస్సు తేటగా ఉన్నదా? అని అంటే, శ్రీరామాయణం మనకు అవుననే సమాధానం చెబుతుంది. మంథర కైకేయితో మొదట

శ్రీరాముని పట్టాభిషేక వార్తను చెప్పింది. కైకేయి అప్పుడు, రాముడైతే ఏమి?, భరతుడైతే ఏమి?, రాముడైనా నా కుమారుడే కదా! అతనికే కదా పట్టాభిషేకం జరుగుతున్నది " అని అంటూ మొదట సంతోషంగానే సమాధానం కైకేయి చెప్పింది. కానీ, క్రమంగా మంథర చేసిన దుర్బోధలను విన్న తరువాత ఆమె మనస్సు పూర్తిగా కలుషితమైనది. మొదట కైకేయి శ్రీరాముని తన కుమారునిగానే భావించినా. కానీ తరువాత మందేథర మాటల వల్ల మనస్సులో కాలుష్యాన్ని పొందింది.

ఇక్కడ ఒక విషయం మనం గమనించవలసి ఉన్నద. వాస్తవంగా కైకేయికి మనస్సులో శ్రీరాముని పట్ల దృఢమైన ప్రీతి ఉన్నట్లయితే, మంథర చెప్పిన మాటలకు ఆ విధంగా కలత పొందుతుందా? ఆమె మనస్సు మారిపోతుందా? మరి ఆమె మనస్సు మంథర మాటలకు ఎందుకు మారిపోయింది? అని మనకు ఇక్కడ సందేహం కలుగుతుంది.

కైకేయి స్వభావం సహజంగా మంచిదే కావచ్చు. శ్రీరాముని విషయంలో ప్రీతిని కలిగినదే కావచ్చు. కానీ, ఆమె స్వభావాన్ని తెలియజేసే ఒక మాటను భరతుడు పలికాడు. కైకేయి వరం అడిగిన విషయం శ్రీరాముడు అరణ్యాలకు వెళ్లిన విషయం, దశరథుడు దుఃఖంలో మునిగిపోయిన విషయం తెలియడానికి ముందే భరతుడు పలికిన మాట ఇది.

భరతుడు, శత్రుఘ్నుడు, ఇద్దరు కలసి భరతుని మేనమామ యుథాజిత్తు ఇంటికి వెళ్లారు. అప్పుడే శ్రీరాముడు వనవాసానికి వెళ్లే సందర్భం ఏర్పడింది. అయోధ్యలో జరిగిన సంఘటనలను గూర్చి భరతునకు తెలియజేయడం కోసం కొంతమంది వార్తాహరులు భరతుని దగ్గర వెళ్లారు. అప్పుడు అయోధ్యలో ఉండే వారి యోగక్షేమాలను విచారించే సందర్భంలో భరతుడు ఈ మాటలను పలికాడు. తన తల్లులు కౌసల్య, సుమిత్ర, కైకేయి –అనే ఈ ఈ ముగ్గురు ఎలా ఉన్నారు? అని వారిని భరతుడు అడుగుతున్నాడు మొదట కౌసల్యను గూర్చి, తరువాత సుమిత్రను గూర్చి, ఆ తరువాత కైకేయిని గూర్చి విచారించాడు. ఈ విధంగా విచారించేటప్పుడు, భరతుడు ఆ ముగ్గురిని ఏ ఏ విశేషణాలతో విశేషించి పలుకుతున్నాడు? అనే విషయం ఇక్కడ గమనించదగినది.

భరతుడు కౌసల్యను గురించి ప్రస్తావిస్తూ, "ఆర్యా చ ధర్మనిరతా ధర్మజ్ఞా ధర్మవాదినీ, ఆరోగా చాపి కౌసల్యా మాతా రామస్య ధీమతః"– అని అంటూ కౌసల్య క్షేమాన్ని విచారిస్తున్నాడు, భరతుడు. ఆమె ధర్మనిరత. ధర్మంలో చాలా ఆసక్తిని కలిగినది. ధర్మాన్ని ఆచరించడంలో, ఆచరింప చేయడంలో నిష్ఠను కలిగినది ధర్మజ్ఞ. ధర్మాలను

తెలిసినది. ధర్మవాదిని. ధర్మాలను పలికేది, ధర్మం కోసం వాదించే స్వభావాన్ని కలిగినది. ఇవి అన్నీ కౌసల్యకు ప్రయోగించిన విశేషణాలు. కౌసల్య ధర్మాన్ని తెలిసినది, ధర్మాన్ని ఆచరించేది, ధర్మం కోసం వాదించేది. ఈ విధంగా కౌసల్యను గూర్చి ప్రశ్నించిన తరువాత, సుమిత్రను ఉద్దేశించి పలుకుతూ, "కచ్చిత్ సుమిత్రా ధర్మజ్ఞా జననీ లక్ష్మణస్య యా"– అని అంటున్నాడు. అంటే, సుమిత్ర ధర్మాన్ని తెలిసినది. ధర్మ మర్మాన్ని తెలిసినది– అని అన్నాడు ఈ విధంగా కౌసల్య, సుమిత్రలలో ఉండే గొప్పతనాన్ని చెప్పిన తరువాత తన తల్లి కైకేయిని ఉద్దేశించి ఈ విధంగా అన్నాడు.

"ఆత్మకామా"– చాలా స్వార్థపరురాలు. తనను గూర్చి మాత్రమే ప్రధానంగా ఆలోచించే స్వభావాన్ని కలిగినది. "సదా చండీ"– ఎల్లప్పుడూ కఠినంగా ఉండే మాట్లాడే స్వభావాన్ని కలిగినది. "క్రోధనా"– మాటిమాటికి కోపించే అలవాటును కలిగినది. " ప్రాజ్ఞమానినీ"– తనకు ఎక్కువ తెలియక పోయినప్పటికీ, అన్నీ తెలుసుననే అభిప్రాయాన్ని కలిగినది. ఇవి అన్నీ కైకేయిని గూర్చి భరతుడు చెప్పిన లక్షణాలు.

కైకేయి మొదట శ్రీరాముని విషయంలో ప్రేమను కలిగి ఉన్న మాట నిజమే. కైకేయి చాలా కఠినంగా వ్యవహరించి శ్రీరాముని వనవాసాన్ని కోరింది అనే సంగతి తెలియడానికి ముందే భరతుడు తన తల్లిని గురించి ఈ విధంగా అన్నాడు అంటే, ఇవి అన్నీ కైకేయికి సహజంగా ఉండే లక్షణాలే కదా. శ్రీరాముని విషయంలో కైకేయికి ప్రేమ ఉన్నది. దానితో పాటుగా సహజంగా ఆమెకు ఈ లక్షణాలు కూడా ఉన్నాయి. శ్రీరాముని పై ప్రేమ ఉన్నప్పటికీ, ధర్మాన్ని గూర్చిన చింత ఆమెకు లేదు. మాటిమాటికి కోపించే స్వభావాన్ని కలిగినదై, తనకు ఇష్టమైన దానిని మాత్రమే కోరుతూ, దానికోసం ప్రయత్నిస్తూ ఉండే స్వభావాన్ని కలిగినది ఇందువల్లనే మంథర ఏవో కొన్ని మాటలను చెప్పగానే ఆమె మనస్సు మారిపోయింది. కాలుష్యాన్ని పొందింది. సహజంగా ఆమెకు ధర్మచింతన ఉండి ఉంటే, ధర్మంలో శ్రద్ధ పట్టుదల కలిగి ఉండి ఉంటే, మంథర చెప్పిన మాటలకు ఆమె మనస్సు మార్పును పొంది ఉండేది కాదు. ఆమెకు కల ఇటువంటి స్వభావాన్ని భరతుడు తన మాటలలోనే వ్యక్తం చేశాడు. ఈ మాటలు రాముడు వనవాసానికి వెళ్లడానికి కైకేయి కారణం అని తెలిసిన తరువాత చెప్పిన మాటలు కావు. అప్పటికి అయోధ్యలో జరిగిన సంఘటనలు ఏమి భరతునకు తెలియవు. ఆ తరువాతనే వార్తాహరులు అతనికి జరిగిన విషయాన్ని తెలిపారు. ఇటువంటి చెడ్డ స్వభావాలను లేనిదై, ధర్మంలో ఆసక్తిని శ్రద్ధను కలిగినది అయి ఉంటే, మంథరల వంటివారు ఎంతమంది వచ్చి ఎన్ని మాటలు చెప్పినప్పటికీ

కూడా, ఆమె మనసులో మార్పు వచ్చి ఉండేది కాదు. శ్రీరాముడు కదా! అంతటి కళ్యాణ గుణాలు కలిగినటువంటివాడు కదా. అతని విషయంలో నేను ఈ విధంగా అపచార పడకూడదు అనే భావం ఆమెకు ఏర్పడి ఉండేది. ఈ విధంగా కలుగకపోవడానికి కారణం ఆమెలో ధర్మచింతన ధర్మంపై శ్రద్ధ లేకపోవడమే.

ఇందువల్ల, ఆస్తిక్యం అనేది ఎవరికైనా స్థిరంగా నిలబడాలి అని అంటే, దైవభక్తి ఉంటే చాలదు, ధర్మంలోను ధర్మశాస్త్రాలలోనూ స్థిరమైన నమ్మికను, శ్రద్ధను కలిగి ఉండాలి. అది ఉన్నప్పుడే భగవంతుని విషయంలో ఉండే భక్తి అనేది స్థిరంగా నిలచి ఉంటుంది. అది ఉన్నప్పుడు ఎవరు మన మనసును మార్చడానికి, కలతను పొందించడానికి ఎంత ప్రయత్నం చేసినప్పటికీ, ఆ ప్రయత్నం సఫలం కాదు.

ఇందువల్లనే కౌసల్య, సుమిత్ర అనే ఇద్దరిని గూర్చి ప్రస్తావించేటప్పుడు, వారు ఇద్దరూ ధర్మాన్ని తెలిసినవారు, ధర్మంలో శ్రద్ధ కలిగినవారు –అని చెప్పడం జరిగింది. అటువంటి ధర్మశ్రద్ధ కైకేయికి లేనందువల్లనే, ఎంతటి ప్రేమ ప్రీతి శ్రీరాముని విషయంలో ఆమెకు ఉన్నప్పటికీ కూడా, మంథర మాటల వల్ల ఆమె మనస్సులో రాకూడని మార్పు వచ్చింది.

అందుచేత, మనకు భగవంతుని విషయంలో ఎంతటి భక్తి ఉన్నప్పటికీ, ఆ భక్తి అనేది, ప్రేమ అనేది ధర్మం విషయంలో మనకు శ్రద్ధ, ఆసక్తి ఉన్నప్పుడే నిలకడగా నిలుస్తుంది –అనే వాస్తవం ఇక్కడ మనకు సుస్పష్టం అవుతున్నది.

మనం, కౌసల్య, సుమిత్రల స్వభావం వంటి ప్రభావాన్ని కలిగి ఉండడానికి ప్రయత్నం చేద్దాం. కైకేయి స్వభావం వంటి స్వభావాన్ని విడచి పెట్టడానికి, పోగొట్టుకోవడానికి ప్రయత్నం చేద్దాం. స్వస్తి.



# 3. ఆళ్వారులు కీర్తించిన చక్రత్తాళ్వారులు

శ్రీవైష్ణవ సంప్రదాయంలో ఆళ్వారులు అనే పేరుతో వ్యవహరింపబడేవారు 12 మంది. వారు భగవంతుని గుణాలలో లోతుగా అవగాహించి, ఆ స్వామిని అందమైన ద్రావిడ పాశురాలలో గానం చేశారు. అయితే, ఆళ్వార్లు అనే పేరుతో పిలువబడే భగవంతుని భక్తులు, భగవంతుని ఆయుధాలు కూడా ఉన్నారు. భగవంతుని వహించే గరుడుని గరుడాళ్వార్ అని, ఆ భగవంతుడు శయనించి ఉండే సర్పాన్ని అనంతాళ్వాన్ అని, ఆ స్వామి చేతిలో ఉండే సుదర్శన చక్రాన్ని చక్రత్తాళ్వాన్, తిరువాళి ఆళ్వాన్ అని కూడా వ్యవహరించడం సంప్రదాయమే.

12 మంది దివ్యసూరులు తాము పాడిన ద్రావిడ భాషలో ఈ ఆళ్వార్లను అందరినీ కీర్తించారు. వీరిలో చక్రత్తాళ్వాన్ అనబడే సుదర్శన చక్రాన్ని తమ సూక్తులలో ఏ విధంగా పాడారు? అనే విషయాన్ని సంగ్రహంగా ఇప్పుడు గమనిద్దాం. వాస్తవానికి ఒక్కొక్క ఆళ్వారు ఏవిధంగా సుదర్శన స్వామినికి కీర్తించారు? అనే విషయం ప్రత్యేక ప్రత్యేకమైన వ్యాసాలుగా అనుభవించవలసి ఉన్నప్పటికీ, ప్రస్తుతం సంగ్రహంగానే ఒకే వ్యాసంలో విన్నపించడం జరుగుతున్నది.

ఆళ్వారుల పాశురాలలో శ్రీసుదర్శన స్వామి వైభవాన్ని మనం గమనించినప్పుడు, పలు కోణాలలో గమనించవచ్చు. శ్రీసుదర్శన ప్రభావం, శ్రీ సుదర్శనుని అందం, శ్రీసుదర్శనుని వల్ల భగవంతనకు కలిగే శోభ, శ్రీసుదర్శనుని వలన భక్తులకు లభించే ప్రయోజనం, శ్రీ సుదర్శనుని అద్భుతమైన శక్తి, శ్రీసుదర్శనుని సంబంధాన్ని కలిగిన కొన్ని పురాణ, ఇతిహాస గాథలు– అనేవి వాటిలో కొన్ని.

శ్రీసుదర్శనం మొదలైన దివ్యాయుధాల స్థానం ఎంత గొప్పది అంటే, పురాణాలలోనూ, ఇతిహాసాలలోను, దివ్యసూరుల దివ్య ప్రబంధాలలోను భగవంతు డు నిర్దేశించేటప్పుడు, వీటిని పురస్కరించుకొని భగవంతుని నామ నిర్దేశం చేయడం జరుగుతుంది. చక్రాన్ని ధరించివాడు కనుక చక్రపాణి, చక్రి అని, శంఖాన్ని ధరించేవాడు కనుక శంఖీ అని, శంఖపాణి అని ఈ విధంగా ఆయా ఆయుధాలను పురస్కరించుకుని భగవంతుని పేరు నిర్దేశింపబడుతున్నది. దీనివల్ల భగవంతునకు, ఈ దివ్యాయుధాలకు మధ్య ఉండే గాఢమైన అవినాభావ సంబంధం స్పష్టం కావడమే కాక, ఈ దివ్యాయుధాలు, భగవానుడు వేరు వేరు కాదు అనే తత్త్వం కూడా స్పష్టమవుతున్నది.

ఇప్పుడు, ఒక్కొక్క ఆళ్వారు ఏ విధంగా చక్రత్తాళ్వార్ వైభవాన్ని ప్రస్తుతించారో, సంగ్రహంగా గమనిద్దాం.

ముందుగా ముదలాళ్వారుల సూక్తులను గమనిద్దాం.

సరోయోగి తమ ప్రబంధం అయిన ముదల్ తిరువందాదిలోని మొదటి పాశురంలోనే చక్రత్తాళ్వారులను స్తుతించారు. సముద్రంవలె అపారమైన తమ సాంసారిక దుఃఖాలు పోవాలి అంటే, ప్రకాశాన్ని వెదజల్లే చక్రాన్ని కలిగిన భగవంతుని కీర్తించాలి– అని ఆరంభించే వారి మొదటి పాశురం చాలా అద్భుతమైనది.

వైయమ్ తగళియా వార్ క్కడలే నెయ్యాగ వెయ్య కదిరోన్ విళక్కాగ– శెయ్య శుడరాళియాన్

1) అడిక్కే శూట్టినేన్ శొల్మాలై ఇడరాళి నీంగుగవే ఎన్ఱు

అని అంటూ, " సముద్రం వలె చాలా విస్తృతమైన, లోతైన, భయంకరమైన సంసార దుఃఖం తీరడం కోసం ఈ జగత్తుకు అంతటికి మూలకారణమైనవాడు, సుదర్శన చక్రాన్ని చేతిలో ధరించినవాడైన ఆ స్వామి శ్రీచరణాలను నేను నా శిరస్సుకు ఆభరణంగా అలంకరించుకున్నాను"– అని భగవంతుని చక్రాయుధాన్ని పురస్కరించుకొని భగవంతుని స్తుతించారు. తమ సంసారదుఃఖం తీరాలంటే, సుదర్శనాన్ని ధరించిన స్వామివల్ల నే అది తీరాలి– అని అంటున్నారు. సుదర్శన వైభవాన్ని తెలియజేసే, ఇటువంటి, వారి పాశురాలు ఇంకా చాలా ఉన్నాయి.

పూదత్తాళ్వార్లు తమ ప్రబంధం రెండవ తిరువందాదిలో– శ్రీసుదర్శనుని చేతిలో కలిగి ఉండే భగవంతుని పూవు వంటి శ్రీపాదాలను తప్ప వేరు దేనిని భావించినా ఏ ప్రయోజనం లేదు–అని అంటున్నారు. "పాడితే ఆ స్వామి గొప్పతనాన్ని పాడాలి, పలికితే అతని నామాలనే పలకాలి, ఆ సుదర్శనధారిని నేను ఏ సమయం లోను మరువడం లేదు"– అని అంటున్నారు.

"ఎన్ఱుమ్ మఱందఱియేన్ ఏళ్ పిఱప్పుమ్ ఎప్పొழుదుమ్ నిన్ఱు నినైప్పు ఒழియా నీర్ మైయాల్, వెన్ఱి అడలాழி కొండ కళ్వనే! ఇన్నక్కడలాழி నీ అరుళి క్కాణ్" అనే పూదత్తాళ్వార్ల సూక్తి ఈ అర్థాన్ని స్పష్టం చేస్తుంది.

భగవంతుని దర్శించేటప్పుడు పగటి కాలం, అతని సాక్షాత్కారం కలుగకపోతే అది రాత్రి సమయం. పగటి సమయంలో ప్రకాశం ఏర్పడడానికి కారణం అతడు తన చేతిలో ధరించిన సుదర్శనుని ప్రకాశమే– అనే అర్థంలో " పగల్ కండేన్, నారణనై క్కండేన్" అని అంటున్నారు పేయాళ్వారులు. మొదట తమకు భగవంతుని సాక్షాత్కారం కలుగడం మొదటి పాశురంలో తెలియజేస్తున్నారు.

"తిరుక్కండేన్ పొన్మేని కండేన్ తిగழுమ్ అరుక్కన్ అణి నిఱముమ్ కండేన్, శెరుక్కిళరుమ్ పొన్నాழி కండేన్, పురి శంగమ్ కైక్కండేన్, ఎన్నాழி వణ్ణన్ పాలిన్ఱు"

అని మొదట లక్ష్మీదేవిని, తరువాత గొప్పగా ప్రకాశించే, బంగారు రంగులోని సుదర్శన చక్రాన్ని, తరువాత పాంచజన్య శంఖాన్ని, ఆ తరువాత వీటిని అన్నిటినీ కలిగిన భగవంతుని– అనే క్రమంలో దర్శించినట్లుగా పలుకుతున్నారు.

ఈ పాశురంలో ఆళ్వార్లు భగవంతుని ప్రకారాలుగా లక్ష్మీదేవి, శంఖం, చక్రం అనే వీటిని కలిగి ఉండే తత్త్వంగా తెలియజేస్తున్నారు. సుదర్శనాన్ని ధరించిన భగవంతుని సౌందర్యాన్ని వర్ణించి, " ఓ మనసా! అందమైన కాంతితో నిండిన సుదర్శన చక్రాన్ని చేతిలో ధరించిన ఆ భగవంతుని నమస్కరించి బాగుపడు. నీ దుఃఖాలు అన్నీ నశించిపోతాయి" అని అంటున్నారు, అళ్వార్లు.

ఒక అందమైన ఉపమానాన్ని చెబుతున్నారు. పగటి కాలంలో సూర్యుని చూడగానే తామర పువ్వు వికసిస్తుంది. రాత్రి వేళ చల్లని ప్రకాశాన్ని ప్రసరించే చంద్రుని చూస్తే, అది ముడుచుకుంటుంది. ఒకే సమయంలో ఈ రెండు ఉన్నట్లయితే, అంటే, సూర్యుని కాంతి, చంద్రుని కాంతి రెండూ ఉన్నట్లయితే ఏమవుతుంది? ఆ విధంగా ఉండే ఒక సందర్భం ఏర్పడుతుందా, ? అని అంటే, భగవంతుని శ్రీహస్తాలలో ఉండే శంఖచక్రాల వల్ల అటువంటి సందర్భం ఏర్పడుతున్నది కదా– అని అంటున్నారు ఈ ఆళ్వార్లు. సూర్యుని వలె ఆ భగవానుని చేతిలోని సుదర్శన చక్రం ప్రకాశిస్తున్నది. ఆ విధంగానే, చంద్రుని వలె ఇంకొక చేతిలో ఉండే తెల్లని పాంచజన్య శంఖం ప్రకాశిస్తున్నది. వీటిని భగవంతుడు ధరించి ఉన్నాడు. అందువల్ల భగవంతుని నాభిలో వికసించిన తామర పువ్వు చక్రాన్ని చూచి సూర్యునిగా భావించి వికసిస్తున్నది, శంఖాన్ని చూచి చంద్రుడని తలచి ముడుచుకుంటున్నది–< అని అంటూ చాలా అద్భుతంగా ఒక పాశురంలో ఈ ఆళ్వార్లుపలుకుతున్నారు. ఆ అందమైన పాశురాన్ని గమనించండి.

"ఆంగు మలరుమ్ కువియు మాల్ ఉంది వాయ్, ఓంగు కమల తినుపోదు– ఆమ్ కై త్తికిరి శుడర్ ఎన్నుమ్ వెణ్ శంగమ్ వానిల్ పగరు మది ఎన్నుమ్ పార్ త్తు" అనేది ఆ పాశురం.

## 2) తిరుమళిశై ఆళ్వార్లు

అళ్వార్లలో చక్రత్తాళ్వారుల అంశతో అవతరించినవారు తిరుమళిశై ఆళ్వార్లు. వీరు తమ రెండు ప్రబంధాలు అ యిన తిరుచ్ఛంద విరుత్తమ్ నాన్ముగన్ తిరువందాదులలో చక్రత్తాళ్వారులను గురించి విశేషంగా కీర్తించారు. వాటిలో ఈ క్రింది పాశురాన్ని గమనించండి.

"తేరుంగాల్ తేవన్ ఒరువనే ఎన్నురైప్పర్
ఆరు మఱియార్ అవన్ పేరుమై, – ఓరుమ్
పొరుళ్ ముడివు మిత్తనైయే ఎత్తవమ్ శెయ్ దార్క్కుమ్
అరుళ్ ముడివదు ఆళియాన్ పాల్"

"అరుళ్ ముడివదు ఆళియాన్ పాల్", అని అంటూ అటువంటి చక్రధారి గొప్పతనాన్ని ఎవరు తెలియగలరు? అని కీర్తిస్తున్నారు. "ఆళి" అనే పదానికి ద్రావిడ భాషలో చక్రం అని ఒక అర్థం, సముద్రం అని కూడా ఇంకొక అర్థం ఉన్నది. ఈ రెండు కూడా భగవంతునకు సమన్వయిస్తాయి. నీరాళి ఈ అంటే సముద్రం. శుడరాళి అంటే చక్రం. ఆ స్వామిని తెలిసికోవాలంటే, భక్తితో తెలుసుకోవాలి తప్ప, వేరొక విధంగా ఎవ్వరికీ తెలిసికోవడానికి సాధ్యం కాదు.

శంఖచక్రాలతో కూడి ఉండే ఆ స్వామి అందాన్ని" వెయ్యవాళి శంగు తండు విల్లుమ్ వాళుమ్ ఏందుమ్ శీర్" అనే పాశురంలో ఈ దివ్యసూరి తెలియజేశారు.

## 3) నమ్మాళ్వారులు

నమ్మాళ్వారులు మనకు దర్శింపజేసే సన్నివేశం చాలా అద్భుతమైనది. అది మనకు రోమాంచాన్ని కలిగిస్తున్నది.

భగవంతుడు సాక్షాత్కరించేటప్పుడు ముందుగా అతడు సాక్షాత్కరించలేదట. మొదట ఆ స్వామి చేతిలోని సుదర్శన చక్రమే కనుపించిందట. చక్రం కనిపించిన తర్వాతనే

మిగిలిన ఆయుధాలు కూడా సాక్షాత్కరించినవట. ఆ తరువాత పరిపూర్ణంగా భగవానుడు దర్శనమిచ్చాడట. అటువంటి సన్నివేశాన్ని క్రింది పాశురంలో గమనించండి.

ఆళ్హి ఎళ్హ, శంగుమ్ విల్లుమెళ్హ, తిశై
వాళ్హి ఎళ్హ, తండుమ్ వాళు మెళ్హ, అండమ్
మోఱ్ఱుళ్హ ఎళ్హ, ముడిపాద మెళ్హ, అప్పన్
ఊళ్హి ఎళ్హ, ఉలకముండ వాఱే.

దీనిని అనుసరించే ఈనాటికి కూడా భగవంతుని తిరువీధి ఉత్సవ సమయంలో ప్రత్యేకంగా పల్లకిలో సుదర్శనుడు భగవంతునకు ముందుగా నగర శోధనను చేస్తూ వేంచేయడం అనే సంప్రదాయం ఏర్పడింది.

నమ్మాళ్వారులు మహాభారత వృత్తాంతాన్ని పాడే సందర్భం ఇది. మహాభారత యుద్ధంలో శత్రువులను సంహరించడం కోసం శ్రీకృష్ణ భగవానుడు ఏ ఆయుధం ధరించలేదు– అని మనం భావిస్తాం, కానీ, అతడు అర్జున రథసారథి కదా. ఆ రథం చక్రాలు గుండ్రంగా కదా ఉంటాయి. ఆ రథచక్రాలు యుద్ధభూమిలో దోర్లగా దోర్లగా, ఆ కురుక్షేత్ర రంగంలో వీరుల తలలు దొర్లిపడ్డాయట. శ్రీ సుదర్శనుడు ఆ రథచక్రాలలో ఆవేశించాడు –అనేటట్లుగా ఒకానొక సన్నివేశాన్ని మనకు ఆళ్వార్లు దర్శింప చేస్తున్నారు. ఈ క్రింది పాశురాన్ని గమనించండి.

"అడైవరుమ్ పడై మంగ ఐవర్ కట్కాగి వెంజమత్తు అన్రు తేర్ కడవియ పెరుమాన్" అని అంటూ రథచక్రాలు దొర్లిన దృశ్యాన్ని మనకు సాక్షాత్కరింప చేస్తున్నారు.

ఇప్పుడు వీరి ఇంకొక సూక్తిని గమనించండి. ఇది పరాంకుశ నాయకి భావనతో పలికే పాశురం. భగవంతుని విరహం వల్ల నాయకీ భావాన్ని పొందిన ఆళ్వారులు పలుకుతున్న సందర్భం ఇది. తన మనసులోని ఆర్తిని తీర్చుకోవాలని ఆశపడుతూ పలికే పాశురం. తన మనసులోని ఆర్తిని తెలియజేస్తూ పరాంకుశ నాయకి తన మనసు ద్వారా భగవంతుని దగ్గరకు ధౌత్యాన్ని పంపుతున్నది " నీవు ఆ స్వామి దగ్గరకు వెళ్లి, నా స్థితిని చెప్పు" అని చెప్పేటప్పుడు ఆ స్వామికి సంబంధించిన గుర్తును తెలియజేస్తున్నది. " నీవు నామాటను ఎవరి దగ్గర చెప్పకు. అక్కడ ఎవరు చేతిలో చక్రాన్ని ధరించి ఉంటాడో, అతడే స్వామి అని నిశ్చయించుకుని, అతని దగ్గర నా మాటను చెప్పు" అని అంటున్నది.

"అడలాళ్హి అమ్మానై కండక్కాల్ ఇదు శొల్లి విడలాళ్హి మడనెంజే!"

అని పలుకుతున్నది, పరాంకుశనాయకి.

భగవంతుని దగ్గర ప్రార్థించేటప్పుడు "శితిర త్తేర్వలవా! తిరుచ్చక్కరత్తాయ్ అరుళాయ్" అని అంటూ ఆ స్వామి చేతిలో ఉండే సుదర్శనాన్ని కీర్తిస్తూ ప్రార్థిస్తున్నారు, నమ్మాళ్వారులు. ఎందుకంటే, శ్రీ సుదర్శనం అనేది కేవలం సంహరించడానికి మాత్రమే ఆయుధం అని భావించకుండా, అది దుఃఖాలను తీరుస్తుంది అని వారు భావిస్తున్నారు. ఆ విధంగా దుఖాలను తీర్చే కార్యం చేయడాన్ని ", అరుళా*ళ్లి* "అని అంటూ నిర్దేశిస్తున్నారు. భగవంతుని నిర్దేశించేటప్పుడు ", ఎల్లప్పుడూరెండు విషయాలను అతడు ధరించి ఉంటాడు" అని అంటున్నారు. అందులో ఒకటి శంఖం ఇంకొకటి చక్రం. " ఆ*ళ్లి*యుమ్ శంగుమ్ శుమర్ న్దార్" అని అంటున్నారు.

నమ్మాళ్వార్లు. ఒక అద్భుతమైన పాశురంలో సుదర్శనుడు ఏ విధంగా భగవంతునిలో కలసి ఉంటున్నాడు? అనే విషయాన్ని వ తెలియజేశారు. ఆ పాశురాన్ని, ఇదిగో, గమనించండి.

కార్ కలంద మేనియాన్ కైకలంద వా*ళ్లి*యాన్
పార్కలంద వల్ వయి*ఱ్ఱా*తాన్ పాంబణైయాన్, శీర్కలంద
శొల్ నినైందు పోక్కారేల్ శూ*ళ్లి* వినైయిన్ ఆ*ళ్లి* తుయరై
ఎన్నినైందు పోక్కువరిప్పోదు?

ఈ పాశురంలో "కైకలంద ఆ*ళ్లి*యాన్" అనే ప్రయోగం చాలా ముఖ్యమైనది. భగవంతుని శ్రీహస్తం వేరు, దానిలో ఉండే చక్రం వేరు– అని చెప్పడానికి వీలు లేనట్లుగా, చక్రం ఆ స్వామి చేతిలో అమరిపోయి ఉంటుంది. ఆ స్వామి ప్రత్యక్షం అయినప్పుడు అంతా అతనితో కలిసి ఒకటిగా కలసి ఉండి అది ప్రత్యక్షమవుతుంది. అతని నల్లని వర్ణం కలిగిన మేనిలో నుండి విడదీయడానికి వీలు లేని విధంగా ఆ స్వామి చేతిలో వేంచేసి ఉంటుంది.

చక్రం లేక పోయినట్లయితే, భగవంతుడు అనే గుర్తు లేదు– అనేది ఇక్కడ సూక్ష్మమైన అర్థం. సహస్రనామం స్తోత్రాన్ని కలిగినవారు ఎంతోమంది ఉండవచ్చునేమో కానీ, సహస్రనామ స్తోత్రం అని అనగానే విష్ణు సహస్రనామస్తోత్రమే గుర్తుకు వస్తుంది. ఆ విధంగానే, చక్రాన్ని కలిగిన వాడు అని అంటే, నారాయణుడు మాత్రమే గుర్తుకు వస్తాడు. రాజోచితమైన వస్త్రాలను, గుర్తులను రాజకుమారుడు అలంకరించుకుంటే, ఆ వస్త్రాలకు, అలంకరణలకు గాంభీర్యం అందం వస్తుంది. ఆ విధంగానే, సుదర్శన చక్రం భగవంతుని చేతిలో ఉన్నట్లయితే, దానికి అంతకు ముందు లేని ఒక నూతనమైన అందం కలుగుతుంది.

అదేవిధంగా, చక్రాన్ని ధరించినందు వల్ల భగవంతుని అందానికి కూడా ఒక కొత్త అందం వస్తుంది–< అనే అర్థంలో "కైకలంద ఆ<u>ழி</u>యాన్" అనే ప్రయోగాన్ని నమ్మాళ్వారులు చేశారు–< అని ఇక్కడ గుర్తించాలి.

## 4) పెరియాళ్వార్లు

పెరియాళ్వార్లు తమ మొదటి ప్రబంధం అయిన తిరుప్పల్లాండు ప్రబంధం మొదటి పాశురంలో భగవంతునకు మంగళాశాసనం చేసేటప్పుడు, మొదట ఆ స్వామి బాహువులకు మంగళాశాసనం చేశారు. ఆ తరువాత ఆ స్వామి పాదాలకు మంగళా శాసనం చేశారు. ఆ తరువాత భగవద్భక్తులకు మంగళాశాసనం చేశారు. ఆ తరువాత ఆ స్వామి వక్షఃస్థలంలో కుడివైపు ప్రకాశించే లక్ష్మీదేవికి మంగళాశాసనం చేశారు. ఆ పిమ్మట దివ్యాయుధాలకు మంగళాశాసనం చేస్తూ, ఆయుధాలలో ముఖ్యమైన సుదర్శనునకు "వలత్తుఱైయుమ్ శుడరా<u>ழி</u>యుమ్ పల్లాండు" అని మంగళాశాసనం చేశారు.

ఒక వైష్ణవుడు "తాను భగవంతునకు దాసుడై ఉన్నాడు" అనే విషయాన్ని తెలుసుకోవడానికి, శేషత్వాన్ని వ్యక్తం చేయడానికి తన భుజాలలోను, ఉపయోగించుకునే అనేక వస్తువులలోను భగవంతుని చక్రాయుధం గుర్తును ముద్రించుకుంటాడు. అప్పుడు అనుసంధించుకునే మంత్రం ఏమంటే, " సుదర్శన! మహాజ్వాల! కోటిసర్య సమప్రభ, అజ్ఞానాంధస్య మే దేవ విష్ణోః మార్గం ప్రదర్శయ" అని. అని అంటూ విష్ణువు తనకు తరించే మార్గాన్ని ప్రదర్శించమని అర్థం వచ్చే మంత్రాన్ని అనుసంధించుకుంటాడు. దీని మూలంగా అతడు భగవంతునకు శేషమై ఉన్నాడు, తన ఆత్మ, తన శరీరం రెండూ కూడా ఆ స్వామికి శేషమై ఉన్నవి. అతడు స్వామి, తాను శేషం అనే విషయాన్ని వ్యక్తం చేసుకుంటున్నాడు.

శ్రీకృష్ణుడు ఒకానొక సమయంలో తాను ద్వారకానగరం నుండి కొంతకాలం వేరొక చోటికి వెళ్లవలసినప్పుడు, తన సేవకులను పిలిచి, " నా భక్తులను మాత్రమే ద్వారకలోకి అనుమతించండి"అని అన్నాడు. అప్పుడు వారు "స్వామీ! నీ భక్తులు అనే సంగతిని ఏవిధంగా గుర్తుపట్టాలి?" అని అడిగినప్పుడు, శ్రీకృష్ణుడు "ఎవరి భుజాలలో చక్రముద్రలు ఉంటాయో వారిని నా భక్తులుగా గుర్తించండి, వారిని అనుమతించండి"అని అన్నాడు.

భగవద్భక్తులను గుర్తించడానికి చక్రలాంఛనం అనేది ప్రధానమైన గుర్తు అనే విషయాన్ని పెరియాళ్వార్లు తమ తిరుప్పల్లాండు ప్రబంధంలో " తీయిల్ పొలిగిన్ఱ

శెంజుడరాళి తిగళి తిరుచ్చక్కరత్తిన్ కోయిల్ పొటియాలే ఒత్తుణ్డు నిన్న్ కుడి కుడి ఆట్చెయ్ గిన్దోమ్" అని తెలియజేశారు. పంచసంస్కారం చేసేటప్పుడు శంఖచక్ర ధారణను చేసుకున్నారు. ఇదే విషయాన్ని తమ ప్రబంధంలోనే ఇంకొక చోట పెరియాళ్వారులు " ఎన్నెయుమ్ ఎన్నుడైమైయుమ్ ఉన్ శక్కర ప్పొఱి ఒత్తిక్కొండు నిన్నరుళే పురిందిరుందేన్" అని అన్నారు.

## 5) ఆండాళ్

గోదాదేవి శ్రీకృష్ణుని దివ్యావతారాన్ని గూర్చి తిరుప్పావై ప్రబంధంలో ప్రస్తావించేటప్పుడు "శంగొడు శక్కర మేందుమ్ తడక్కైయన్" అని చక్ర సంబంధాన్ని పురస్కరించుకొని కీర్తించినది. వర్షాన్ని వర్ణించేటప్పుడు మెరుపును, పిడుగును చేర్చి వర్ణిస్తారు. పిడుగు అనేది ధ్వని. కాంతి అనేది ప్రకాశం. కాంతి, ధ్వని అనే వీటిని చేతిలో కలిగినవాడు భగవంతుడు. మెరుపు వంటి ప్రకాశాన్ని కలిగిన చక్రాయుధాన్ని పిడుగు వంటి ధ్వనిని వెలువరించే పాంచజన్య శంఖాన్ని భగవంతుడు ధరించి ఉన్నాడు– అనే విషయాన్ని తిరుప్పావై ప్రబంధంలో " ఆళిపోల్ మిన్ని, వలంపురి పోల్ నిన్న్ అదిర్ న్దు" అని అంటూ గోదాదేవి తెలిపింది.

## 6) తొండరడిప్పొడి ఆళ్వారులు

సూర్యునకు కాంతిని కలిగించేది సుదర్శనుని కాంతిలోని అంశమే. అందువల్లనే చక్రాయుధాన్ని "తిగిరి "అని అనేటట్లే, సూర్యుని కూడా "తిగిరి" అనే పదంతో ఆళ్వార్లు నిర్దేశిస్తారు.

తిరుప్పళ్ళి ఎழుచ్చి ప్రబంధంలో శ్రీరంగనాథునకు సుప్రభాతం పలికేటప్పుడు తొండరడి ప్పొడి ఆళ్వారులు "సూర్యుడు ఉదయించాడు" అనే అర్థాన్ని వ్యక్తం చేస్తూ, "శుడర్ ఒళి పరందన" అనే పాశురంలో "అడల్ ఒళి తిగళి తరు తిగిరి అమ్ తడక్కై అరంగత్తమ్మా! పళ్ళిఎழున్దరుళాయే" అనే సూక్తి ద్వారా "నీ చక్రాయుధం కాంతిని పొంది ప్రకాశించే సూర్యుడు ఉదయించాడు, ఇక నీవు కూడా నిద్రలేవాలి సుమా! "అని చక్రాయుధాన్ని పురస్కరించుకొని పాడడాన్ని గమనించాలి.

## 7)కులశేఖరాళ్వార్లు

కులశేఖరాళ్వార్లు శ్రీ రంగనాథుని కీర్తించేటప్పుడు, ఆ స్వామి చేతిలో ధరించి ఉండే ఆయుధాలను వరుసగా ఈ విధంగా కీర్తిస్తున్నారు.

"కోలార్ న్ద నెడుమ్ శార్ ఙ్గమ్ కూనల్ శంగమ్ కొలై యాழி" అని శత్రువులను వధించే చక్రాయుధాన్ని కలిగి ఉండేవాడు శ్రీరంగనాథుడు అని కీర్తించి, భక్తుల మనసులలో ఉండే భయాన్ని భగవంతుడు ధరించిన ఆ చక్రాయుధం తీరుస్తుంది–అని వర్ణించారు

## 8) తిరుమంగై అళ్వార్లు

తిరుమంగై ఆళ్వారులు చాలా పాశురాలలో చక్రాయుధాన్ని కీర్తించారు. భాగవతంలో ఉండే శిశుపాలవధం, బాణాసురవధం, పౌండ్రక వాసుదేవ వధం మొదలైన అనేక వృత్తాంతాలను అన్నిటిని చక్రాయుధాన్ని పురస్కరించుకొని కీర్తించారు.

తిరువల్లి క్కేణి దివ్యదేశాన్ని గుర్తించేటప్పుడు గజేంద్రుని రక్షించిన వైభవాన్ని చాలా విరివిగా వారు వర్ణించారు.

చేపలు ఆనందంగా తుళ్ళి క్రీడిస్తున్న సరస్సు అది. ఆ సరస్సులో అందమైన తామర పువ్వులు పూచాయి. వాటిని ప్రతి దినం కోసి, భగవంతునకు సమర్పించడం గజేంద్రునకు అలవాటు. ఈ విధంగా ఒకనాడు ఆ గజరాజు ఆ చెరువులోకి వెళ్లి, అక్కడ పూచిన ఫ్లతామర పూలను కోయబోయింది. అప్పుడు ఆ సరస్సులో ఉండే ఒక మొసలి ఆ ఏనుగు కాలును గట్టిగా పట్టుకొని నీటిలోకి లాగడం ఆరంభించింది. అప్పుడు ఆ మొసలికి, ఏనుగుకు మధ్య చాలా తీవ్రమైన పోరాటం సంభవించింది. ఈ పోరాటంలో ఎవ్వరూ గెలువలేదు కానీ, క్రమంగా ఏనుగు శక్తి తగ్గిపోవడం ఆరంభించింది, ముసలికి కల శక్తి పెరిగింది.

అప్పుడు ఆ గజేంద్రుడు తన తొండాన్ని పైకెత్తి ప్రార్థన చేసింది. "ఓ ఆదిమూలమా! అని భగవంతుని పిలచింది. "స్వామీ! నేను చనిపోతున్నాను అనే భయం బాధ నాకు లేదు. అయితే, నా తొండంలో ఉండే ఈ తామర పువ్వును నీ శ్రీపాదలలో సమర్పించడానికి సాధ్యం కాలేదే! అని బాధగా ఉన్నది" అని అన్నది.

ఆ గజేంద్రుని బాధను తీర్చడం కోసం భగవంతుడు గరుడునిపై ఎక్కి, వేగంగా ఆ సరస్సు దగ్గరకు వచ్చాడు. "అదే వేదంతో తన చేతిలోని చక్రాయుధాన్ని ప్రయోగించాడు" అని ఆళ్వారులు అనలేదు, "తొట్టాన్"– కేవలం తాకాడు –అని మాత్రమే అని అన్నారు. సామాన్యంగా సుదర్శన చక్రం భగవంతుడు తన చేతితో తిప్పి ప్రయోగించే వరకు వేచి ఉంటుంది. కానీ, ఈ సందర్భంగా చక్రాయుధం అంతవరకు వేచి ఉండలేదు. తనను

భగవంతుడు తాకిన వెంటనే మహావేగంగా వెళ్లి, ఆ మొసలి కంఠాన్ని కత్తిరించింది– అని అంటున్నారు.

ఈ సందర్భంగా సుదర్శనుని వేగం భక్తుల దుఃఖాన్ని తీర్చడంలో ఏ విధంగా ఉంటుంది? అనే విషయాన్ని ఇక్కడ ఆళ్వార్లు దర్శింప చేస్తున్నారు. చక్రాయుధానికి చాలా గొప్ప విశేషం ఒకటి ఉన్నది. అతనికి నమస్కరిస్తే చాలు. భగవంతుడు వచ్చి రక్షించడానికి ముందుగానే వేగంగా వచ్చి భగవద్భక్తులను రక్షిస్తాడు– అనే ఒక సూక్ష్మమైన అర్థాన్ని ఇక్కడ ఈ పాశురంలో తిరుమంగై ఆళ్వార్లు దర్శింప చేస్తున్నారు. ఆ పాశురాన్ని ఇప్పుడు గమనించండి.

మీనమర్ పొయ్ గై నాణ్ మలర్ కొయ్ వాన్ వేట్కైయినోడు శెన్ఱిళిన్ద
కానమర్ వేழమ్ కై ఎడుత్తలఱ కరా అదన్ కాలినై క్కదువ
ఆనైయిన్ తుయరమ్ తీర ప్పుళ్ళూర్ న్దు శెన్ఱు నిన్ఱాழி తొట్టానై
తేనమర్ శోలై మాడ మామయిలై తిరువల్లి క్కేణి క్కండేనే
(చేపలు తుళ్ళి ఆడే సరస్సులో అప్పుడే వికసించిన తామర పువ్వులను కోయడం కోసం దాని లోపలికి దిగిన గజేంద్రుని కాలును ఆ సరస్సులో ఉండే మొసలి పట్టుకొని లోపలికి లాగింది. అప్పుడు ఆ గజేంద్రుని బాధను తీర్చడం కోసం గరుడుని పై అధిరోహించి వెళ్లిన భగవానుడు సుదర్శనుని తన చేతితో తాకాడు. అటువంటి స్వామిని ఇప్పుడు నేను, తేనెను నిండుగా కలిగిన తోటలను కలిగిన, ఎత్తయిన భవనాలను కలిగిన తిరువల్లి క్కేణి క్షేత్రంలో సేవించాను.)

ఇక్కడ "శెన్ఱు నిన్ఱాழி తొట్టానై" అనే ప్రయోగం గమనించదగినది. దీనిని గమనిస్తే, చక్రాయుధ వేగం ఎంతటిదో తెలుస్తుంది. ఈ విధంగా అనేక పాశురాలు ఉన్నాయి.

ఆళ్వారులు చక్రాయుధం గొప్పతనాన్ని వందలాది పాశురాలలో కీర్తించి, ఆనందించారు. వాటిలో ఒక కణం మాత్రమే ఈ వ్యాసంలో మనం అనుభవించాం ఆళ్వార్లు కీర్తించిన శ్రీసుదర్శనస్వామిని సేవిద్దాం. ఆ స్వామి అనుగ్రహాన్ని పొందుదాం.

★★★★★

# 4. భగవద్విషయంలో మన చౌర్యం

ఒక వస్తువును, దానిని కల సొత్తుదారునకు తెలియకుండా, అనుమతి లేకుండా, తీసుకొని వచ్చి, దానిని ఏ విధమైన సంకోచం లేకుండా, అది మనది అనే భావంతో ఉపయోగించడమే దొంగతనం అవుతుంది. భగవంతుడు తమ హృదయాన్ని దొంగిలించుకొని పోయినట్లుగా, పరాంకుశ పరకాల నాయకిలు అలమటించడాన్ని మనం పలు పాశురాలలో అనుభవిస్తున్నాము.

వేదాంతదేశికులు అయితే, ఇక్కడ ఇంకొక విధమైన, ఒక నూతనమైన దొంగతనాన్ని గూర్చి పలుకుతున్నారు. వారు చెప్పిన దానినిబట్టి మనం అందరందొంగలమే. మనం ఒక అమూల్యమైన వస్తువును దొంగతనం చేస్తూ, ఎటువంటి సంకోచం లేకుండా, సిగ్గు లేకుండా, దానికి మనం సొంతంగా భావించి, ఆనందిస్తున్నాము.

ఆ వస్తువు ఏమి? మనం ఎవరి దగ్గర నుండి దానిని దొంగతనం చేస్తున్నాము? అనే విషయానికి సమాధానంగా కవి సార్వభౌముల ఈ క్రింది అత్యాశ్చర్యకరమైన దేవనాయక పంచాశత్ అనే స్తోత్రంలోని 48వ శ్లోకాన్ని గమనించండి.

ఆత్మాపహార రసికేన మయైవ దత్తమ్
అన్యై రధార్య మధునా విబుధైకనాథ! ,
స్వీకృత్య ధారయితు మర్హసి మాం త్వదీయం
చోరాపనీత నిజనూపురవత్ స్వపాదే.

ఏ విషయాన్ని ప్రతిపాదన చేసినా, దానిని సోదాహరణంగా తెలియజేయడం అనేది మన పూర్వాచార్యులు క్రమం. ఆ విధంగానే ఇక్కడ కూడా దృష్టాంతపూర్వకంగా వక్తవ్య విషయం ప్రతిపాదన చేయబడుతున్నది.

దేవనాయక స్వామీ! నీ పాదాలకు అలంకరింపబడిన నూపురాన్ని ఒకడు దొంగలించి తీసుకొని పోయాడు. తన ఇంటిలో ఉండే అందరికీ దానిని పెట్టి చూచాడు. అయితే, అది ఎవరికి సరిపోలేదు. దొంగిలించి తీసుకుని వచ్చిన వస్తువునకు ఏదైనా ఒక ఉపయోగం ఉండాలి కదా. ఇక్కడ అది లేదు కనుక, ఆ నూపురం అనేది నీ పాదాలకే తగినది–అనే జ్ఞానాన్ని పొంది, దానిని వాడు నీ దగ్గరకు తీసుకొని వచ్చి, సమర్పిస్తే, నీవు దానిని తీసికొని నీ పాదాలలో అలంకరించుకుంటావు కదా.

"జీవులమైన మేము నీకు నిత్యనిరుపాధిక శేషభూతులం. నీవే సర్వశేషివి. పరతంత్రులమైన మేము మమ్ములను సరిగా అర్థం చేసుకోలేకపోయాము. "మేము మాకు

చెందినవారం కాము. మా రక్షణకార్యం కోసం మేము ప్రయత్నం చేసి కోవలసిన బాధ్యత కలిగినవారం కాము" అనే వాస్తవాన్ని తెలుసుకో లేకుండా, మేము ఒక దొంగతనం చేశాము. అది ఏమి? అంటే, మేము నీకే శేషం అనే వాస్తవాన్ని తెలియకుండా స్వతంత్రులము అనే తగని భావాన్ని కలిగి ఉన్నాము. "ఎనదావియుమ్ ఉనదే" (నా ఆత్మ కూడా నీదే) అని ఆళ్వారులు పలికిన సత్యాన్ని మరచిపోయి, నీకు సొంతమైన ఆత్మను మాది అని భావించి, దానిని నీ దగ్గరనుండి దొంగిలించి, దానిని అనుభవించి ఆనందిస్తూ ఇంత కాలం గడిపాము. అనాది అయిన కర్మ ప్రవాహం చేత దొంగిలించిన ఆత్మానుభవమే పరమ భోగ్యంగా భావించి, ఏ విధమైన సంకోచం లేకుండా, వ్యక్తంగానే దానిని అనుభవించాము. ఇప్పుడు నీ అనుగ్రహ విశేషం చేత యథార్థజ్ఞానాన్ని పొందినవారమై, "ఈ జీవాత్మ నీకు మాత్రమే శేషం అయిన వస్తువు, అది ఇంకొకరికి ఎవరిది శేషం కాదు, అది నీచేతనే రక్షింపబడవలసినది" అని తెలుసుకున్నాము.

అడంగెళ్లిల్ శంబత్తు అడంగ క్కండు ఈశన్
అడంగెళ్లిల్ అఃివదెన్న అడంగుగ ఉళ్ళే (తిరువాయ్ మొఴి – 1– 2 –7)

(అంతటా ప్రకాశించే భగవంతుని విభూతిని చూచి, అది అంతా ఆ భగవంతునిదే అని నిశ్చయం చేసికొని, ఆ భగవద్విభూతిలోనే అంతర్భవించి ఉండండి) అనే సత్యాన్ని తెలుసుకొని నీలో అణగి ఉన్నాము. "నీ చరణాలే శరణం" అని నిశ్చయాన్ని పొంది, నీ దగ్గర నుండి దొంగతనం చేసి, తీసుకొని వచ్చిన ఆత్మను నీ దగ్గరే సమర్పించాము. మా ఈ సమర్పణాన్ని వాత్సల్యాన్ని కలిగినవాడవైన నీవు అంగీకరించి, ఈ ఆత్మను స్వీకరించి, నీ చరణాల సమీపంలో రక్షింపబడవలసిన వస్తువుగా స్వీకరించాలి. దొంగ తిరిగి తీసుకుని వచ్చి సమర్పించిన నూపురాన్ని దాని సొత్తుదారుడు దయతో తీసుకొన్నట్లుగానే, , ఆ ఆత్మను నీవు స్వీకరించి, నీ చరణాలలో దానిని అలంకరించుకోవాలి– అని వేదాంతదేశికులు దేవనాయక స్వామి శ్రీచరణాలలో ఆత్మసమర్పణాన్ని చేస్తున్నారు.

శ్రీదేశికుల ఈ శ్లోకాన్ని పురస్కరించుకొని మనం కూడా ఆ భగవంతుని సన్నిధానంలో ఆత్మసమర్పణాన్ని చేసి, తరిద్దాం.

★★★★★

# 5. వర్ణనలో వేదాంతం

"లౌకికనాం హి సాధూనా మర్థం వాగనువర్తతే
ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థో ౽ నుధావతి"

"లోకంలో సాధువుల మాట అర్థాన్ని అనుసరిస్తుంది, మహర్షుల వాక్కును అర్థమే అనుసరిస్తుంది" అనేది ఒక సూక్తి.

"వేదశాస్త్రరథారూఢాః జ్ఞానఖడ్గధరా ద్విజాః,
క్రీడార్థమపి యద్బ్రూయుః స ధర్మో వేద నేతరః"

వేదశాస్త్రం అనే రథాన్ని ఎక్కినవారు, జ్ఞానమనే ఖడ్గాన్ని ధరించినవారైన ద్విజులు యాదృచ్ఛికంగా పలికిన సూక్తి కూడా ధర్మమే తప్ప, వేరొకటి కాదు– అని తెలియాలి– అనేది ఇంకొక సూక్తి.

వీటిని బట్టి మహనీయులైన మహర్షుల వచనాలు అన్నీ తత్వార్థాలను ప్రబోధించేవిగానే ఉంటాయి–అని తెలుస్తున్నది. వారు పలికే మాటలు ఏవీ వ్యర్థ ప్రలాపాలుగా ఉండవు. వర్ణనపరంగా పైపైకి కనిపించే వచనాలలో కూడా గ్రహించవలసిన వేదాంతార్థాలు ప్రకాశిస్తాయి. ఈ అంశాన్ని నిరూపించే శ్రీవిష్ణుపురాణంలోని ఒకానొక సందర్భాన్ని అనుసంధించుకుందాం.

ఇది ఆ పురాణంలోని పంచమాంశంలో ఉండే పదవ అధ్యాయంలోని సందర్భం. శరత్కాలవర్ణనను పరాశమహర్షి చేస్తున్నారు. ఈ వర్ణనలో కూడా తమ వాక్చాతుర్యాన్ని ప్రదర్శిస్తున్నారు.

రేపల్లెలో బలరాముడు శ్రీకృష్ణుడు క్రీడిస్తూ ఉండే సందర్భంలో వర్షాకాలం గడిచిపోయి, శరత్కాలం వచ్చింది. ఈ సందర్భంగా ప్రకృతిలో గోచరించే దృశ్యాల నుండి కొన్ని తత్త్వాలను మహర్షి మనకు తెలియజేస్తున్నారు. శరత్కాల దృశ్యాలు వైరాగ్యాన్ని కలిగించేవిగా ఉన్నాయి, అని అంటున్నారు.

జలప్రదేశాలలో ఎక్కడ చూసినప్పటికీ, తామర పూలు పూచి ప్రకాశిస్తున్నాయి. గుంటలు మొదలైన జలప్రదేశాలు అన్నీ సూర్యరశ్మి వేడిమి చేత పాపాన్ని పొందుతున్నాయి. అందువల్ల అక్కడ ఉండే చేపలు చాలా తాపాన్ని కలిగినవి అవుతున్నాయి. ఆ చేపల స్థితిని

చూచిన పరాశర మహర్షి గృహస్థుల స్థితిని భావిస్తున్నారు. వెంటనే దానినే ఉదాహరణంగా పలుకుతున్నారు.

"అవాపుః తాపమత్యర్థం శఫర్యః పల్వలోదతకే,
పుత్ర క్షేత్రాధిసక్తేన మమత్వేన యథా గృహీ"

భార్య, బిడ్డలు, గృహాలు మొదలైనవాటిలో సంగాన్ని కలిగిన గృహస్థులు ఆ సంబంధం చేత అనేక విధాలయిన తాపాలను పొందుతున్నారు. ఇది లోకంలో ప్రత్యక్షంగా కనిపించే విషయం. ఈ విధంగానే చేపలు కూడా తాము చాలా కాలం అలవాటు పడిన గుంటలతో కలిగి ఉండే సంబంధించేత, వాటిలోని నీరు వేడిపడినప్పుడు, తాము కూడా వాటి వల్ల చాలా తాపాన్ని పొందుతున్నాయి.ఇంకొక చోట, వర్షాకాలంలో నల్లని పెద్ద మేఘాలను చూసి ఆనందించి నాట్యమాడిన నెమళ్లు ఈ శరత్కాలంలో ఆ మేఘాలు లేనందువల్ల ఆనందాన్ని, మదాన్ని కోల్పోయి, మౌనంగా ఉంటున్నాయి. మొదట ఈ సంసారంలో ఉండే అసారమైన స్వభావాన్ని తెలియకుండా, అందులో సంగాన్ని పొంది, ఇష్టం వచ్చినట్లుగా తిరిగి అలసిపోయి, తరువాత యోగం చేసి ఈ సంసారం అసారమైనది అనే విషయాన్ని తెలిసికొని, మౌనవ్రతాన్ని పొందిన యోగుల స్థితిని ఈ నెమళ్ళ స్థితిని పురస్కరించుకొని మహర్షి తెలుపుతున్నారు.

మయూరాః మౌనమాతస్థుః పరిత్యక్తమదా వనే,
అసారతం పరిజ్ఞాయ సంసారస్యేవ యోగినః.

వర్షాకాలంలో నల్లని మేఘాలు అన్ని తమ వద్ద ఉన్న నీటిని అంతటినీ వర్షించి శరీరం తెల్లబడిపోగా, ఆకాశాన్ని విడచిపెట్టి అదృశ్యమైపోయాయి. నిజమే, ఆత్మజ్ఞానులు కూడా అహంకార మమకారాలను విడచిపెట్టి, మనసులోని ద్వేషాలు లేనివారై పరిశుద్ధమైన శరీరంతో భార్య, పుత్రులు, సంపద మొదలైన వానిని విడచి పెట్టి వెళ్ళిపోతున్నారు కదా. ఇటువంటి ఆత్మజ్ఞానుల స్థితిని శరత్కాలంలోని మేఘాల స్థితి తెలుపుతున్నది.

ఉత్సృజ్య జలసర్వస్వం విమలాః సితమూర్తయః,
తత్యజు శ్చాంబరం మేఘా గృహాన్ విజ్ఞానినో యథా

లోకంలోని అనేక విధాలైన వస్తువుల విషయంలో కలిగిన సంగంచేత పామరుల మనసులు ఆకర్షింపబడి బాధను పొందేటట్లే, సూర్యకిరణాల చేత గుంటలలోని నీరు తాపాన్ని పొందుతున్నది.

శరత్సూర్యాంశుతప్తాని యయుః శోషం సరాంసి చ,

బహ్వాలంబమమత్వేన హృదయానీవ దేహినామ్.

మంచివారి మనసు జ్ఞానాలతో రాగద్వేషాలు లేకుండా పోయి, సమత్వాన్ని పొందేటట్లే, శరత్కాలంలోని నీరు కూడా కాలుష్యం అంతా తొలగిపోగా, తెల్ల కలువుపూలతో సామ్యాన్ని పొందుతున్నది.

కుముదైః శరదంభాంసి యోగ్యతాలక్షణం యయుః,
అవబోధైః మనాంసీవ సమత్వ మమలాత్మనామ్.

మంచి కులంలో పుట్టిన యోగి ముక్తిని పొందదగిన అంతిమ శరీరాన్ని పొంది ప్రకాశించేటట్లే, చంద్రుడు పూర్ణ మండలాన్ని పొంది ప్రకాశిస్తున్నాడు.

తారకావిమలే వ్యోమ్ని రరాజాఖండమండలః,
చంద్రః చరమదేహాత్మా యోగీ సాధుకులే యథా.

గొప్ప విద్వాంసులు ద్రవ్యాల విషయంలో ఉండే సంగాన్ని కొంచెం కొంచంగా విడిచి పెట్టేటట్లే, నీటి ప్రదేశాలు కూడా తీరప్రదేశాలను కొంచెం కొంచెంగా విడిచిపెట్టి తొలగిపోతున్నాయి.

శనకైః శనకైః తీరం తత్యజుశ్చ జలాశయాః,
మమత్వం క్షేత్రపుత్రాధిరూఢం ఉచ్చైర్యథా బుధాః.

వర్షాకాలంలో జల ప్రదేశాలను విడచిపెట్టి వెళ్ళిపోయిన హంసలు ఈ శరత్కాలం రాగానే మళ్లీ వచ్చి అక్కడకు చేరుతున్నాయి. యోగంలో స్పష్టతను పొందనివారు మొదట యోగం చేయడం ఆరంభించేటప్పుడు అవిద్య మొదలైన దోషాలు వీరిని విడచి వెళ్లిపోతాయి. ఆ తరువాత అనేక విధాలయిన ఆటంకాల చేత వారు యోగాన్ని చేయలేక దానిని విడచి పెట్టినప్పుడు, పూర్వం తొలగిపోయిన ఆ క్లేషాలు మళ్లీ వచ్చి చేరుతున్నాయి. హంసలు జలప్రదేశాలను మళ్ళీ శరత్కాలంలో వచ్చి చేరడం దీనిని సూచిస్తున్నది.

పూర్వం త్యక్తైః సరోంభోభిః హంసా యోగం పునర్యయుః,
క్లేశైః కుయోగినో యోగై రంతరాయహతా ఇవ.

మంత్రాలు మొదలైనవాటి ద్వారా మహాయోగాన్ని పొందిన యతుల మనసు స్థైర్యాన్ని పొంది, చలనం లేకుండా ఉండేటట్లే, సముద్రం కూడా అధికమైన తరంగాలు లేకుండా నిశ్చలంగా ఉన్నది.

నిభృతోఽ భవదత్యర్థం సముద్ర స్తిమితోదకః,

క్రమావాప్తమహాయోగీ నిశ్చలాత్మా యథా యతిః

అంతటా భగవంతుని దర్శించినవాని మనస్సు మలినం లేకుండా నిర్మలంగా ప్రకాశించేటట్లే, అంతటా మీరు నిర్మలంగా ప్రకాశిస్తున్నది.

సర్వత్రాతి ప్రసన్నాని సలిలాని తథాభవన్,
జ్ఞాతే సర్వగతే విష్ణౌ మనాంసీవ సుమేధసామ్.

యోగుల మనస్సులో ఉండే దోషాలు యోగాల వల్ల తొలగిపోయేటట్లే, ఈ శరత్కాలంలో ఆకాశంలో ఉండే నల్లని మేఘాలు అన్ని తొలగిపోయాయి.

బభూవ నిర్మలం వ్యోమ శారదా ధ్వస్త తోయదమ్,
యోగాగ్నిదగ్ధక్లేశౌఘం యోగినామివ మానసమ్.

అహంకారంచేత కలిగే దుఃఖాన్ని వివేకం అనేది లేకుండా చేసేటట్లే, సూర్యుని వల్ల ఏర్పడిన తాపాన్ని చంద్రుడు పోగొడుతున్నాడు.

సూర్యాంశుజనితం తాపం నిరన్యే తారాపతిశ్శమమ్
అహంమానోద్భవం దుఖం వివేకః సుమహానివ.

ప్రత్యాహారం అనేది యోగాల అంగాలలో ఒకటి. ఇది శబ్దం మొదలైన తమ తమ విషయాలనుండి ఆకర్షణను పొంది ఉండే శ్రవణేంద్రియం మొదలైన ఇంద్రియాలను ఆయా విషయాలనుండి నివర్తింపచేయడం. ఈ విధంగానే, ఈ శరత్కాలం కూడా ఆకాశంనుండి మేఘాలను, భూమి నుండి బురదను, నీటి నుండి కాలుష్యాన్ని పోగొడుతున్నది.

నభసోబ్దం భువః పంకం కాలుష్యం చాంభస శ్శరత్,
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః ప్రత్యాహార ఇవాహరత్

గుంటలు, చెరువులు, నదులు మొదలైనవాటి నుండి కాలువల దారులుగా నీటిని ప్రవహింప చేసి, కావలసిన చోట్ల ఆ నీటిని నింపి, ఆ విధంగానే నీటిని తేటపడేటట్లు చేస్తున్నారు ఈ కార్యంలో యోగుల ప్రవృత్తిని మహర్షి దర్శిస్తున్నారు. ఈ యోగికూడా మొదట లోపల ఉండే ప్రాణవాయువును బయటకు వెలువరించి, మళ్లీ ప్రాణవాయువుతో ఉదరాన్ని నింపి, ఆ విధంగానే దానిని తేటపడేటట్లు చేయడం మొదలైన కార్యాలను ఇది సూచిస్తుంది. రేచకం, పూరకం, కుంభకం అని ఈ కార్యాలు చెప్పబడతాయి. ఈ విధంగా ఉండే మూడు విధాలైన కార్యాలను చేయడమే ప్రాణాయామం. ఈ విధంగా ప్రాణాయామాన్ని చేసే యోగివలె ఈ జలప్రదేశాలు కూడా ఉన్నవి.

ప్రాణాయామ ఇవాంభోభిః సరసాం కృతపూరకైః,
అభ్యస్యతే ఽ నుదివసం రేచకాః కుంభకాదిభిః.

ఈ విధంగా లోకంలో కనిపించే దృశ్యాల ద్వారా ఉన్నతమైన శాస్త్రార్థాలను పరాశరమహర్షి తెలియజేశారు. ఈ రీతిలో తత్త్వార్థాలను అవలీలగా తెలియజేయగల్గడం మహర్షులకే సాధ్యం.

★★★★★

# 6. గోవర్ధనపూజలోని వైదికరహస్యమ్

## శ్రీకృష్ణుని ప్రశ్న

శరత్కాలంలో తాము అలవాటుగా చేసే ఇంద్ర పూజ కోసం రేపల్లెలోని గోపాలురు ప్రయత్నాన్ని చేయడాన్ని శ్రీకృష్ణుడు గమనించాడు. వారిలో గొప్పవృద్ధులను చూచి శ్రీకృష్ణుడు ఈ విధంగా ప్రశ్నించాడు.

"గోపవృద్ధులారా! మీకు చాలా సంతోషాన్ని ఇచ్చే ఈ మహోత్సవం అనేది ఏది? దానిని ఏ విధంగా చేయాలి? ఈ విషయాన్ని నాకు చెప్పండి" అని అన్నాడు.

## నందుని సమాధానం

అప్పుడు నందుడు ఈ విధంగా శ్రీకృష్ణునకు సమాధానం చెప్పాడు. " కుమారా! శ్రీకృష్ణా! మేఘాలకు, జలాలకు, దేవతలకు ప్రభువైన ఇంద్రుడు అధిపతి. మేఘాలు అతని చేత ప్రేరేపింపబడి వర్షాన్ని కురిపిస్తాయి. ఈ వర్షం వల్ల ఫలించే పంటలను మనం, మిగిలిన ప్రాణులు ఉపయోగించుకుంటున్నాము. మనం దేవతలను ఆరాధించి పూజిస్తున్నాము. ఈ వర్షం వల్ల పెరిగే గడ్డిని తిని, ఈ పశువులు చక్కగా పెరిగి మంచి మంచి దూడలను ప్రసవించి, మిక్కిలిగా పాలను ఇస్తున్నాయి. వర్షం కురిసే చోట భూమి బాగా సారవంతమై ప్రకాశిస్తుంది. ఆ ప్రదేశంలో నివసించే జనులు ఆకలి, వ్యాధి మొదలైన పీడలు ఏమీ లేకుండా సుఖంగా జీవిస్తారు. భూమిలో ఉండే జలాన్ని సూర్యుడు తన కిరణాలతో గ్రహించి మేఘాలలో విడుస్తున్నాడు. తరువాత మేఘాధిపతి అయిన ఇంద్రుడు లోక క్షేమం కోసం ఆ నీటిని వర్షంగా కురిపిస్తున్నాడు. అందుచేత రాజులు మొదలైన అందరూ వర్షాకాలం గడిచిపోగానే, మిక్కిలి సంతోషంతో యాగాలను చేసి, ఇంద్రుని ఆరాధిస్తారు ఆ విధంగానే మనం కూడా చేసి, ఇంద్రుని ఆరాధిస్తున్నాము. ఈ క్రమంలోనే ఈ శరత్కాలంలో కు ఈ మహోత్సవం చేయాలని భావించి ప్రయత్నం చేస్తున్నాము " అని అన్నాడు.

## శ్రీకృష్ణుని ప్రతివచనం

ఈ విధంగా గోపాలుర పక్షాన్ని, అంటే, అభిప్రాయాన్ని నందగోపుడు చెప్పగా శ్రీకృష్ణుడు విన్నాడు. ఇంద్రుని గర్వాన్ని లేకుండా చేయాలని భావించి, తన అభిప్రాయాన్ని ఈ విధంగా తెలియజేశాడు.

"తండ్రీ! నేను చెప్పే మాటను వినండి. మనం పంటలను పండించేవారం కాము. వ్యాపారం చేసేవారం కాము. అరణ్యాలలో పశువులను మేపి జీవించేవారం. అందుచేత పశువులే మనకు దైవం. ఆన్వీక్షకి అనబడే తర్క శాస్త్రం, త్రయీ అనబడే మూడు వేదాలు, వార్తా అనబడే సస్యాలు మొదలైన వాటిని తెలియజేసే శాస్త్రం, దండనీతి అనబడే అర్థశాస్త్రం మొదలైన నాలుగు శాస్త్రాలు లోకంలో ప్రధానమైనవిగా ఉన్నాయి. వీటిలో, వార్తా శాస్త్రం పంటలను పండించడం, వ్యాపారం చేయడం పశువులను మేపడం మొదలైన మూడు విధాలైన వృత్తులను వివరిస్తున్నది. పంటలను పండించే వ్యవసాయదారులకు పైరులను పెట్టడం, అంగడిలో వ్యాపారం చేసేవారికి వస్తువులను అమ్మడం, మనకు గోవులను మేపడం ముఖ్యమైన వృత్తులు. ఏ విద్యతో ఒకడు జీవనం నడుపుతున్నాడో, అతడికి ఆ విద్యయే ప్రధానమైనది. గౌరవించదగినది కూడ. అంతేకాక, మనం దేనివల్ల ప్రయోజనాన్ని పొంది జీవిస్తున్నామో, దానిని మనం పూజించాలి. దానిని విడచి పెట్టి ఇంకొక దానిని పూజించేవాడు ఇహలోకంలోనూ, పరలోకంలోను మంచిని పొందలేడు.

"యో యస్య ఫల మశ్నన్ వై పూజయత్యపరం నరః,
ఇహ చ ప్రేత్య చైవాసౌ న తదాప్నోతి శోభనమ్"

అరణ్యంలో నివసించే మనం పర్వతాల వల్లనే పలు విధాలైన ప్రయోజనాలను పొంది జీవించగలుగుతున్నాము. ఎల్లలు అనేవి పంటలను పండించే క్షేత్రాల చివర ఉంటాయి. ఈ ఎల్లలకు ఆవలి వైపున ఉండేవి అరణ్యాలు. ఈ అరణ్యాలే మనం నివసించే చోటు. ఈ అరణ్యాల చివరలో ఉన్నవి పర్వతాలు. అందుచేత ఈ పర్వతాలే మనకు చాలా ముఖ్యమైనవి. వాకిళ్లను, తలుపులను కలిగిన ఇళ్లలో నివసించేవారు వ్యవసాయం చేసేవారు, వ్యాపారం చేసేవారు. మనం ఆ విధంగా కాకుండా, నిర్దిష్టమైన నివాసాలను కలిగి ఉండకుండా, తోచిన చోట్ల అంతా, ఇల్లు వాకిళ్ళు లేకుండా, కనబడిన చోట్లలో బండ్ల ద్వారా సంచారం చేస్తూ సుఖంగా జీవిస్తున్నాము. మనం సుఖంగా జీవించేటట్లే వ్యవసాయం చేసేవారు, వ్యాపారం చేసేవారు జీవించడం లేదు. మన ఇటువంటి సుఖమైన జీవనానికి ముఖ్య కారణంగా ఉన్నవి ఈ పర్వతాలే. ఇవి కామరూపాతో తమ కొండ చరియలలో సంచరిస్తాయని వింటున్నాము. ఈ పర్వతాల విషయంలో ఎవరైనా, ఏమైనా అపరాధం చేస్తే, అప్పుడు ఇవి సింహాలు మొదలైన భయంకరమైన మృగాల రూపాన్ని పొంది, వారిని వధిస్తాయట. అందుచేత ఈ పర్వతాలను ఉద్దేశించి, పశువులను ఉద్దేశించి యాగాలను చేయండి ఇవే కదా మనకు దైవాలు.

ఈ విధంగా ఉండగా, ఇంద్రుడివల్ల మనకు ఏమి ప్రయోజనం? బ్రాహ్మణులకు మంత్రాలవలె, యజ్ఞాల వలె, వ్యవసాయం చేసేవారికి నాగళ్లకు చేసే యజ్ఞం వలె, ఉత్సవం వలె, మనకు గిరియజ్ఞం, గోయజ్ఞం ముఖ్యం. అందువల్ల వాటిని చేద్దాం. ఈ గోవర్ధన పర్వతాన్ని అనేక విధాలైన ఉపచారాలను, చేసి శాస్త్రాల ప్రకారం అర్చించి. ఆరాధించండి. ఇందుకోసం ఈ రేపల్లెలో ఉండే పెరుగు, పాలు, నేయి మొదలైన వస్తువులను అన్నిటినీ తీసుకొని రండి. బ్రాహ్మణులకు, అన్నాన్ని కోరి వచ్చే వారికి అందరికీ అన్నాన్ని పెట్టి ఉపచారాలను చేయండి. విధంగా ఈ పర్వతాన్ని పూజించి, బ్రాహ్మణులకు అన్నాన్ని పెట్టి, ఉపచారం చేసిన తర్వాత, ఈ శరత్కాలంలో పూచే పూలతో గోవుల కొమ్ములను అలంకరించి, పర్వతాల చుట్టూ వాటిని తిప్పండి. ఇది నా అభిప్రాయం. మనసులో ఆనందించి నేను చెప్పిన రీతిలో చేస్తే, పశువులకు, పర్వతానికి, నాకు చాలా ఆనందం కలుగుతుంది.

"ఏతన్మమ మతం గోపాః! సంప్రీత్యా క్రియతే యది,
తతః కృతా భవేత్ ప్రీతిః గవా మద్రే స్తథా మమ"

ఈ విధంగా శ్రీకృష్ణుడు తన అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పాడు. ఇదే శ్రీకృష్ణుని మతం. తన అభిమానంలో ఒదిగి ఉండేవారు దేవతాంతర భజనను చేయడం కూడదు– అనేది ఇక్కడ పరమ తాత్పర్యం.

ఈ సందర్భంగా వేదాంతదేశికులు చూపిన వేదతత్త్వం ఏమంటే,

వేదాంతదేశికులు శ్రీకృష్ణుని ఈ అభిప్రాయాన్ని చాలా అందంగా అనుగ్రహించారు. తన కులదైవాన్ని విడచిపెట్టి ఇంకొక నూతనమైన దైవాన్ని ఆశ్రయించకూడదు. పూజించకూడదు. ఈ నియమాన్ని దాటి, ఒకడు తన దైవాన్ని విడిచిపెట్టి, ఇంకొక దైవాన్ని పూజించినట్లయితే, ఆ ఇద్దరు దైవాలు కూడా అతని చేయి విడచి పెడతారు. అతడు మహా పాపాన్ని చేసినవాడు అవుతాడు – అని అన్నారు.

"అతియజేత నిజాం యది దేవతా ముభయతః చ్యవతే ఽ ప్యఘుమ్"

అని అన్నారు. ఇది ఒక వేదవాక్యాన్ని అనుసరించి చెప్పిన సూక్తి. కులదైవాన్ని విడిచిపెట్టి ఇంకొక దైవాన్ని ఆరాధించకూడదు– అనే విషయాన్ని వేదం కూడా బలపరుస్తున్నది. ఆ వాక్యాలను గమనించండి.

"యో వై స్వాం దేవతా మతియజతే ప్ర స్వాయై దేవతాయై చ్యవతే, న పరాం ప్రాప్నోతి"

తన కులక్రమాగతంగా వచ్చిన దైవాన్ని విడచి కొత్తగా ఇంకొక దైవాన్ని ఆరాధించేవాడు తన దైవం నుండి, అన్యదైవం నుండి దూరం అవుతున్నాడు. "తనను విడచి పెట్టాడు "అని కులదేవత, " ఈ విధంగానే తనను కూడా ఇతడు విడచి పెడతాడు" అని భావించి ఇతర దేవత ఇతనిని చేయి విడుస్తారు. ఇంతే కాదు, పాపం కూడా వస్తుంది– అని ఈ వేదవాక్యం వల్ల తెలుస్తుంది.

ఈ వాక్యాలలో ఉండే అర్థాన్ని పురస్కరించుకునే ఇంతకుముందు ప్రస్తావించిన సూక్తిని వేదాంతదేశికులు అనుగ్రహించారు– అని స్పష్టం అవుతున్నది కదా. వంశపరంపరగా వచ్చే కుల దైవాన్ని విడచిపెట్టి, ఒకడు తన కులానికి చెందని ఒక దేవతను ఆరాధించినా, తరువాత అతడు పెద్దల ద్వారా ఆ విధంగా చేయడం తప్పు అని తెలుసుకొని, తగిన క్రమంలో తన కులానికి తగిన దైవాన్ని అతడు కొత్తగా ఆరాధించడం ఆరంభించాడు అని అనుకోండి. ఈ పని చేయకూడదు– అని పైన తెలిపిన వేదవాక్యం చెబుతున్నది– అని భావించరాదు. తగిన రీతిలో తగిన దైవాన్ని ఆశ్రయించడాన్ని విడచి పెట్టి, అన్యదైవాన్ని ఆశ్రయించడమే తప్పు –అని చెబుతున్నది, పైన తెలిపిన వేదవాక్యం.

ఈ శ్రుతివాక్యంలోను, గోవర్ధన పూజ వృత్తాంతంలోను సూచింపబడిన తత్త్వమే పెరియాళ్వారులు అనుగ్రహించిన తిరుప్పల్లాండు ప్రబంధంలోని " ఎన్దై తన్దై తన్దై తన్దై తమ్మూత్తప్పన్ ఏழ் పడికాల్ తొడండి వందు వழி వழி ఆట్చెయ్ కిన్రోమ్" (నా తండ్రి, అతనికి తండ్రి, అతనికి తండ్రి, అతనికి ముత్తాత అనే క్రమంలో ఏడు తరాల నుండి కులక్రమంగా నీకు మేము సేవచేస్తు ) అనే సూక్తిలో ఉపదేశించారు.

గీతాచార్యుడు కూడా ఈ అర్థాన్ని " శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్" అని తెలిపాడు.

మనం కూడా వేదం, శ్రీకృష్ణ పరమాత్మ, పెరియాళ్వార్లు ఉపదేశించిన క్రమాన్ని అనుసరించి, స్వధర్మలో నిష్ఠను కలిగి ఉంటడి, ఉజ్జీవనాన్ని పొందుదాం. స్వస్తి.



# 7. సర్వలోకశరణ్యుని వ్రతం

"శరణాగతియే గొప్ప మోక్షోపాయం" అని, ఆ శరణాగతిని ఆచరించడానికి బ్రాహ్మణులు, అంతిమ కులంవారు అనే తేడా లేకుండా అందరూ అర్హులే అని శ్రీదేశికులు తాము అనుగ్రహించిన పలు గ్రంథాలలోని పలు సూక్తుల ద్వారా నిరూపించి పలికారు. వాటిలో ప్రధానమైన సూక్తి శరణాగతి దీపిక అనే స్తోత్ర ప్రబంధం. అందులో శ్రీరామచంద్రుని శరణాగత రక్షణ వ్రతాన్ని పురస్కరించుకొని దీపప్రకాశస్వామి(విళక్కొళి ఎంబెరుమాన్) అనే అర్చామూర్తి సన్నిధిలో ప్రపత్తిని ఈవిధంగా విజ్ఞాపన చేస్తున్నారు.

యం పూర్వ మాశ్రితజనేషు భవాన్ యథావత్
ధర్మం పరం ప్రణిజగౌ స్వయ మానుశంస్యమ్,
సంస్మారితః త్వమసి తస్య శరణ్యభావాత్
నాథ! త్వదాత్తసమయా నను మాదృశార్థమ్. (శరణాగతదీపికా –45)

దీపప్రకాశ స్వామీ! భక్తుల విషయంలో కరుణను కలిగి ఉండడమే నీకు గొప్ప ధర్మం. ఈ వాస్తవాన్ని నీవే నీ నోటితో శ్రీరామావతారంలో వ్యక్తం చేశావు. ఆ ధర్మాన్ని ఇప్పుడు నీకు జ్ఞాపకం చేసి, దాసుడనైన నా విషయంలో అనుగ్రహం చూపమని వేడుతున్నాను. నీవే అందరికీ రక్షకుడవై ఉన్నావు. భక్తుల కోసం నీవు చెప్పే సత్యం అంతా దాసుడైన నావంటి తక్కువ స్థితిలో ఉన్నవారి కోసం ఏర్పడలేదా ఏమి? అందువల్ల నీ సత్యాన్ని నా విషయంలో కూడా రక్షించి తీరాలిసుమా" అని శ్రీరామావతారంలో విభీషణుని విషయంగా వ్యక్తం చేసిన సత్యాన్ని పురస్కరించుకొని, ఇక్కడ దీపప్రకాశ స్వామి దగ్గర విన్నపం చేస్తున్నారు, దేశికులు.

## శ్రీరామావతారంలోని శరణాగతరక్షణవ్రతం

దుష్టుడైన రావణునకు తమ్ముడు విభీషణుడు. జనస్థానంలో జటాయువును వధించి సీతను అపహరించుకొని పోయి, ఆమెను లంకలో చెరలో పెట్టాడు, రావణుడు. ఆ సీతాదేవి రాత్రి పగలు అనే తేడా లేకుండా, శ్రీరాముని స్మరిస్తూ మనసులో దుఃఖపడుతున్నది. "సీతను రామునకు తిరిగి ఇచ్చి శరణు వేడు" అని విభీషణుడు రావణునకు న్యాయమైన మాటలను చెప్పినప్పటికీ, అతడు యముని చేత ప్రేరితుడై విభీషణుని హితాన్ని అంగీకరించ లేదు. అంతేకాక, అతడు విభీషణుని రాజ్యం నుండి బహిష్కరించాడు. అందువల్ల విభీషణుడు శరణాగతి చేయడానికి వచ్చినవారిని ", భయపడవద్దు" అని అభయం ఇచ్చే స్వభావాన్ని కలిగిన శ్రీరాముడు తన విషయంలో ఎవరు

ఏమి చెప్పినా రక్షించకుండా ఉండడు– అని నమ్మి, తన నలుగురు మంత్రులతో కలసి, వెంటనే శ్రీరాముడున్న చోటికి వచ్చి,

నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్,
సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే, (యుద్ధకాండ– 17– 17)
అని అంటూ శ్రీరాముని శరణు పొందాడు, విభీషణుడు. అంతేకాక,
" పరిత్యక్తా మయా లంకా మిత్రాణి చ ధనాని చ,
భవద్గతం మే రాజ్యం చ జీవితం చ సుఖాని చ" (యుద్ధకాండ –19– 5)

"శ్రీరామచంద్రా! రావణనకు తమ్ముడను అయిన నేను అతని చేత అవమానింపబడినవాడనై సర్వలోక శరణ్యుడవు అయిన నిన్ను శరణు పొందాను. లంకలో ఉండే నా భార్యను, పుత్రులను, ఐశ్వర్యాన్ని విడచి పెట్టి, నీవే గతి అని భావించి వచ్చాను. ఇక నా జీవితం నీదే, సుఖాలు అన్ని నీ అధీనమే" అని అన్నాడు.

శ్రీరామలక్ష్మణులపై చాలా ప్రీతిని కలిగిన సుగ్రీవుడు విభీషణుని రాకను చూచి, ఆ విభీషణుని వల్ల వారికి ఏదైనా అపాయం కలుగవచ్చు– అని భయపడ్డాడు.

"ఏష సర్వాయుధోపేతః చతుర్భి స్సహ రాక్షసైః
రాక్షసో ఒ భ్యేతి పశ్యధ్వ మస్మాన్ హంతుం నసంశయః" (యుద్ధకాండ –17 –7)
"అంతర్ధాన గతా హ్యేతే రాక్షసాః కామరూపిణః.
శూరాశ్చ నికృతిజ్ఞాశ్చ తేషు జాతు న విశ్వసేత్,
ప్రణిధీ రాక్షసేంద్రస్య రావణస్య భవేదయమ్,
అనుప్రవిశ్య సో ఒ స్మాసు భేదం కుర్యాన్న సంశయః" (యుద్ధకాండ –17– 21, 22)

ఇతడు నలుగురు రాక్షసులతో సమస్త ఆయుధాలను ధరించి వచ్చాడు. నిన్ను శరణు పొందేవాడు అయినప్పటికీ, నమ్మదగినవాడు కాదు. ఇతడు రావణుని దగ్గర నుండి వచ్చినందువల్ల ఇతని విషయంలో మనం నమ్మకం పెట్టుకోకూడదు. ఇతడు రావణుని చేత పంపబడి వచ్చిన వేగుచారునిగా ఉండవచ్చు. వీరు తమ నిజమైన పేర్లను, స్వరూపాన్ని ఎవరికీ తెలియకుండా కప్పిపుచ్చుకొని తీయగా మాట్లాడుతూ అనుకూలంగా ఉండేవారి వలె ప్రవర్తించి మనలను మోసం చేసి, మనకు హాని చేయగలిగినవారు. ఆ రీతిలో ఈ విభీషణుడు మనలను వంచించడం కోసం వచ్చినవాడే. అందుచేత అతనిని అంగీకరించకూడదు. ఇతడు మన రహస్యాలను తెలుసుకోవడానికి వచ్చినవాడు మాత్రమే

కాడు. సమయం చూచి నిన్ను, లక్ష్మణుని కూడా చంపడంకోసం రావణుని చేత పంపబడినవాడై ఉండవచ్చు– అని అన్నాడు.

ఆ తరువాత మాట్లాడిన అంగదుడు, జాంబవంతుడు కూడా

ప్రకృత్యా రాక్షసేంద్రస్య భ్రాతా మిత్రస్య తే ప్రభో! ,
ఆగతస్య రిపోః పక్షాత్ కథమస్మిన్ హి విశ్వసేత్" (యుద్ధకాండ– 17– 25)

"శ్రీరామా! ఇతడు రావణుని తమ్ముడు. రాక్షసవంశానికి చెందినవాడు. ఇతడు వచ్చిన కాలం, దేశం కూడా తగినవి కాదు. ఇతడు నిన్ను చరణ పొందేవాడు అయినప్పటికీ, శత్రువు దగ్గరనుండి వచ్చినందువల్ల ఇతనిని పరీక్షించకుండా అంగీకరింకూడదు" అని అన్నారు.

వానరసేనల వాదాలను అన్నిటినీ విని, చివరకు భగవానుడైన శ్రీరాముడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే,
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ" (యుద్ధకాండం – 18– 33)

"ఓ వానరవీరులారా! శరణు అని వచ్చి చేరినవానిని, అతని దగ్గర ఏ విధమైన దోషం ఉన్నప్పటికీ కూడా, నేను ఏ విధంగానూ అతనిని విడిచి పెట్టను. ఎవడు, తనను నా దగ్గర సమర్పించుకొని, " నేను నీ వాడను" అని చెప్పి, ఒక పర్యాయం ప్రపత్తి చేస్తాడో, అతనిని నేను రక్షించి తీరుతాను. చేతులను జోడించి శరణు పొందినవాడు విరోధి అయినప్పటికీ, లేక, మిత్రుడు అయినప్పటికీ, వేరు ఎవరైనప్పటికీ కూడా, అతనిని రక్షించకుండా నేను విడచిపెట్టను. అతనిని రక్షించడమే నా స్వరూపానికి తగినది. ఈ రాక్షసుడు దుష్టుడైనా కానీ, మంచివాడైనా కానీ, ఇతనికి నన్ను ఏమీ చేయడం సాధ్యం కాదు. శరణు పొందినవానిని రక్షించకుండా విడిచిపెడితే చాలా గొప్ప దోషం వస్తుంది. అందువల్ల శరణం అని పలికినప్పుడే, ఇతడు విభీషణుడైనా, లేక, విభీషణుని వేషం వేసుకొని వచ్చిన రావణుడే అయినా సరే, నేను అతనిని రక్షించి తీరుతాను. ఇది నా వ్రతం" అని పలికి తన మాటలను ముగించాడు.

ఈ విధంగా శ్రీరాముడు చెప్పిన మాటలను విని, అతని గుణాన్ని చక్కగా గ్రహించి ఆనందించిన వానరవీరులు "శ్రీరామా! నీవే సర్వలోక రక్షకుడవు. లోకానికి హితాన్ని అనుగ్రహించడంకోసమే అవతరించినవాడవు" అని పొగడారు.

శ్రీరాముడు విభీషణుని విషయంలో చూపిన ఈ అభయప్రదానాన్ని అనుసరించి, అతనికి అనుగ్రహించినట్లుగా తమకుకూడా అనుగ్రహించాలి– అని సర్వలోకశరణ్యుని సన్నిధిలో శ్రీదేశికులు విజ్ఞాపన చేస్తున్నారు. వారు మన కోసం చేసిన ఈ విజ్ఞాపనసూక్తులను పురస్కరించుకొని, మనం కూడా ఆ శ్రీరామచంద్రుని సన్నిధిలో శరణు పొంది, ఆ స్వామి అనుగ్రహాన్ని పొంది తరిద్దాం. స్వస్తి.

★★★★★

# 8. ఆర్తిని తీర్చే శ్రీవేంకటాచలం

పరమపదంలో కైంకర్య సామ్రాజ్యానికి అధిపతియై ఉన్నప్పటికీ, తన పరత్వస్వరూపాన్ని మరుగుపరచుకొని, తనను శరణు పొందే భక్తుల పైన ఉండే అంతు లేని పక్షపాతం వల్ల, కరుణే మూర్తీభవించినవాడై, వారు తనను ఆశ్రయించడానికే హేతువై, నిత్య విభూతిలోనుండి కిందకు దిగివచ్చి, అర్చావతార రూపంలో ఈ భూలోకంలో నిత్యవాసం చేయాలనే అభిప్రాయాన్ని కలిగిన భగవానుడైన శ్రీమన్నారాయణుడు ఈ కలియుగంలో ప్రత్యక్ష దైవమై అర్చారూపిగా మొట్టమొదటగా శ్రీవేంకటాచలంలో శ్రీనివాస స్వామిగా ఆవిర్భవించాడు.

గంగ కంటే పవిత్రమైన కావేరి నదీతీరం, ఇంకా పలు పుణ్య నదుల తీరాలు, సారవంతమైన ప్రదేశాలు, కాంచి, మధుర వంటి పుణ్యక్షేత్రాలు ఎన్నో ఉన్నప్పటికీ, భగవంతుడు ఒక పర్వతాన్ని తన నివాసంగా చేసుకోవడానికి ఏమి కారణం?

చాలా ఉన్నతమైన ఒక పర్వతం నుండి ప్రవహించే కొండవాగు ఎత్తు పల్లం అనే తేడాను ఏమీ గమనించకుండా, ఎటువంటి అడ్డు అదుపు లేకుండా, కిందకు ప్రవహించి, ఆ పర్వతంలో నివసించే స్థావరాలు చక్కగా పెరిగి అభివృద్ధి అయ్యేటట్లు చేస్తుంది. ఈ ఆ పర్వతంలో నివసించే జీవరాసుల అన్నటి దాహం తీర్చి, వాటికి శాంతిని, తృప్తిని, శక్తిని కలిగిస్తుంది. తరువాత పలు వాగులతో కలసి ఒక మహానదిగా రూపాన్ని పొంది, కిందకు ప్రవహించి భూమిలోని పలు ప్రదేశాలను సారవంతం చేసి బాగు చేస్తుంది.

ఆ విధంగానే ఈ లోకంలో సంసారం అనే చాలా భయంకరమైన ఎడారి ప్రాంతంలో బంధింపబడి బాధలను పడుతున్న చేతనులను తన చల్లని కటాక్షంతో తడిపి ఉజ్జీవింప చేయడం కోసమే భగవంతుడు చాలా ఉన్నతమైన తిరుమల పర్వతం పైన ఆవిర్భవించాడు. తన అంతు లేని దయను ఏనాటికి ఎండిపోని ఒక నదీప్రవాహంగా ప్రవహింప చేసి, దానిని దేవతలు మానవులు, ఉన్నతులు, తక్కువవారు అనే ఏ తేడా లేకుండా అందరి విషయంలోనూ సమానంగా ప్రవహింపచేసి, తన అనుభవంలో వారిని ముంచెత్తుతున్నాడు. దయ అనే కొండ వాగుతో సౌలభ్య సౌశీల్య వాత్సల్య గుణాలను చేర్చి అనన్యోపాయత్వం అనే ఒక సాటి లేని సముద్రంగా వృద్ధిచేసి, ఈనాటికీ సంసార సాగరం నుండి మనలను రక్షించి కాపాడుతున్నాడు, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడైన శ్రీనివాసుడు.

సాటి లేని ఈ తిరుమలను, అక్కడ ప్రకాశించే శ్రీనివాస ప్రభువును ఆళ్వారులు, మన పూర్వాచార్యసార్వభౌములు అనేక విధాలుగా కొనియాడారు.

★★★★★

# 9. శ్రీరామానుజునకు, శ్రీరామానుజులకు సామ్యం

శ్రీయతిరాజసప్తతి అనే స్తోత్రంలోని 13వ శ్లోకంలో భగవద్రామానుజులకు భగవంతుని మధ్య ఉండే సామ్యాలను ఆవిష్కరిస్తూ శ్రీకృష్ణుడే భగవద్రామానుజులుగా అవతరించారు అనే నిర్ధారణను శ్రీదేశికులు చేస్తున్నారు. ఆ శ్లోకాన్ని గమనించండి.

"శమితోదయశంకరాదిగర్వః
స్వబలాదుద్ధృతయాదవప్రకాశః,
అవరోపితవాన్ శ్రుతే రపార్థాన్
నను రామావరజః స ఏష భూయః. "

"మైన్నంబు వేల్ కణ్ నల్లాళ్ మున్నమ్ పెఱ్ఱ వళై వణ్ణమ్ నన్ మామేని తన్ నంబినంబి " (కాటుక పూసిన బాణం వలె వేలాయుధం వలె ఉండే కళ్ళను కలిగిన రోహిణి ముందుగా పొందిన తెల్లని వర్ణాన్ని కలిగిన కోపాన్ని కలిగినవాడైన గుణపూర్ణుడైన బలరామునకు తమ్ముడు) అనే విధంగా శ్రీకృష్ణుడు బలరామునకు తమ్ముడు కనుక, రామానుజుడు అనే పేరును పొందాడు. జగదాచార్యులైన శ్రీభాష్యకారులు కూడా రామానుజనామంతో ప్రసిద్ధులు.

(శమితోదయ శంకరాదిగర్వః) శ్రీకృష్ణుడు– బాణాసుర యుద్ధంలో శంకరునకు అపజయం కలిగించి, ఇంద్రుడు వడగళ్ళవర్షాన్ని కురిపించినప్పుడు గోవర్ధన పర్వతాన్ని ఎత్తి ఆ వడగళ్ల వాన నుండి రేపల్లెను రక్షించి. చతుర్ముఖ బ్రహ్మ రేపల్లెలోని ఆవుల లేగదూడలను దాచి పెట్టినప్పుడు లేగ దూడలను సృష్టించి, ఈ విధంగా వారి అందరి గర్వాలను అణచివేశాడు.

శంకరులు, భాస్కరులు అనే వారి మతాలను తమ వాదపటిమతో ఖండించి, భగవద్రామానుజులు వారిని నిరాకరించారు. శ్రీ శంకరులు "బ్రహ్మం సత్యం, జీవుడు, బ్రహ్మం ఒకటే, వేరు కాదు, బ్రహ్మం నిర్గుణం" అని వేదంలో ఉండే కొన్ని అభేద శ్రుతులను పురస్కరించుకొని అద్వైత సిద్ధాంతాన్ని స్థాపించారు, శ్రీరామానుజులు– "బ్రహ్మమూ, సత్యమే, లోకం సత్యమే, జీవుడు సత్యమే. జీవుడు, బ్రహ్మం ఒకటి కాదు బ్రహ్మం చేతనాచేతనాలను తనకు శరీరంగా కలిగి ఉన్నాడు. వాటిలో ఒక్కొక్కటిలోనూ బ్రహ్మం అంతర్యామిగా ఉన్నాడని తెలియాలి. ఇది తప్ప తెలియవలసినది వేరే ఏమీ లేదు. పరమ పురుషుని అనుభవించేవాడుగా, అనుభవింపబడే వస్తువుగాను, ప్రేరేపించేవాడుగాను, ఈ మూడు స్థితులలో తెలుసుకోవాలి.

భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా
సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మ మేతత్"
ఏతత్ జ్ఞేయం నిత్యమేవాత్మసంస్థం
నాతః పరం వేదితవ్యం హి కించిత్,

బ్రహ్మం లెక్కలేనన్ని కళ్యాణ గుణాలకు సముద్రంవంటివాడు" అనే విషయాన్ని ఉపనిషత్తులను ప్రమాణంగా గ్రహించి, ఆళ్వారుల శ్రీసూక్తులను దానికి సహాయంగా చేసుకొని, శ్రీరామానుజులు స్థాపించారు ఈ విధంగానే, భాస్కర మతాన్ని కూడా ఘటక శ్రుతి వాక్యాలను ప్రమాణంగా గ్రహించి ఖండించారు. శంకర మతం, భాస్కర మతం మొదలైన ఇతర మతాలను ఖండించి, వారి గర్వాన్ని అణచివేశారు, శ్రీరామానుజులు.

(స్వబలాదుద్ధృతయాదవప్రకాశః) యాదవ వంశానికి సంబంధించినవారిని చాలా కాలంగా బాధపెడుతూ వస్తున్న కంసుని తన బలంతో వధించి, యాదవులకు సుఖంగా జీవించే మంచి మార్గాన్ని ఏర్పాటు చేసిన శ్రీకృష్ణుడు యాదవ ప్రకాశుడయ్యాడు.

"కప్యాసం పుండరీక మేవ మక్షిణీ" అనే ఉపనిషద్వాక్యానికి, ఇంకా కొన్ని వేదవ్యాలకు అపార్థాలను చెబుతున్న యాదవ ప్రకాశలను శ్రీ రామానుజులు తమ నిశితమైన జ్ఞానంతో ఆ యాదవ ప్రకాశులు చెప్పే అర్థాలను ఖండించి, సరియైన అఅర్థాలను తెలిపి, వేదపురుషుని హృదయాన్ని స్పష్టం చేశారు. ఆ తరువాత ఆ యాదవ ప్రకాశుని తమ శిష్యునిగా పరిగ్రహించి, పంచసంస్కారాలను చేసి, అతనికి ఉజ్జీవనాన్ని కలిగించారు.

(అవరోపితవాన్ శ్రుతే రపార్థాన్) తన భక్తురాలైన ద్రౌపదిని పెద్ద సభలో అవమానం చేసిన దుర్యోధనుడు మొదలైనవారిని, ఆ అన్యాయాన్ని అడ్డుకోని భీష్ముడు, ద్రోణుడు మొదలైనవారిని భారత యుద్ధంలో అర్జునునకు సహాయభూతుడై, అతని సారథిగా నిలచి వధించాడు, పార్థసారథి అయిన శ్రీకృష్ణుడు.

వేదాంతవాక్యాలకు ఇతర మతాలవారు విరుద్ధంగా పలికిన అర్థాలను అన్నిటిని నిరాకరించి తమ సరి అయిన శ్రీ సూక్తులతో వాటిని ఖండించి వెధవాక్యాలకు సరి అయిన అర్థాలను తెలియజేశారు శ్రీ భాష్యకారులు.

ఈ విధంగా శ్రీకృష్ణులకు, భగవద్రామానుజులకు మధ్య ఉండే అందమైన, యుక్తమైన సామ్యాలను పరిశీలించి చూస్తే, శ్రీకృష్ణ భగవానుడే భాష్యకారులుగా అవతరించాడు అని చెప్పడం అనేది చాలా యుక్తంగా ఉంటుంది– అని ఒక యుక్తమైన నిర్ణయాన్ని శ్రీదేశికులు చేస్తున్నారు.

★★★★★

# 10. భాగవతశ్రీపాదసంబంధవైభవమ్

శ్రీవిష్ణుపురాణ భాగవతాది పురాణాలలో వర్ణింపబడిన గజేంద్రమోక్ష వృత్తాంతం సుప్రసిద్ధమైనది. ఈ వృత్తాంతంలో సూక్ష్మంగా భాసించే ఒక విషయాన్ని ఇప్పుడు అనుసంధించుకుందాం.

భగవద్భక్తుడైన ఇంద్రద్యుమ్నుడు అనే ప్రభువు అగస్త్య మహాముని ఇచ్చిన శాపవశంచేత గజేంద్రుడుగా మారిపోయాడు. రూపం మారినప్పటికీ, పూర్వ కృత పుణ్యవశంచేత అతనికి గల భగవద్భక్తి పోలేదు. ప్రతి దినం కొలనులో పూచే తామర పూలను కోసి, భగవంతుని పాద సన్నిధిలో సమర్పించేవాడు. ఆ క్రమంలోనే ఒకనాడు అతడు ఒక సరస్సులో పూచిన తామర పువ్వును చూచి, దానిని కోయడంకోసం ఆ కొలనులో ఒక దిగాడు. అందులో ఉండే ఒక మొసలి ఆ గజేంద్రుని కాలును పట్టుకున్నది. హూ హూ అనే గంధర్వుడు దేవలమహర్షి శాపవశంచేత ఆ మొసలి రూపాన్ని పొందాడు.

గజేంద్రుడు మొసలి నోటినుండి బయటపడడం కోసం చాలా కాలం ప్రయత్నం చేశాడు. కానీ, ఆ పని అతనికి సాధ్యం కాలేదు. క్రమంగా మొసలి బలం పెరిగింది, గజేంద్రుని బలం తగ్గింది. తనను రక్షించుకునే శక్తి తనకు లేదని తెలిసిన తరువాత గజేంద్రుడు భగవంతుని రక్షించమని ప్రార్థించి, శరణాగతి చేశాడు. తన ప్రాణాలు పోయేలోగానే తాను కోసిన తామర పూవును భగవంతుని పాద సన్నిధిలో సమర్పించ గలిగే అదృష్టాన్ని తనకు కలిగించి, తాను చేసే కైంకర్యాన్ని స్వీకరించమని భగవంతుని ప్రార్థించాడు.

గజేంద్రుని ప్రార్థనను ఆలకించిన భగవంతుడు తత్తర పాటుతో చాలా వేగంగా సరస్సు తీరానికి వచ్చి, సుదర్శన చక్రాన్ని ప్రయోగించి, మొసలి కంఠాన్ని ఖండించి, గజేంద్రుని రక్షించాడు. మొసలి కూడా శాపవిమోచనాన్ని పొంది, నిజరూపాన్ని పొంది, మోక్షాన్ని పొందింది. గజేంద్రుడు భగవంతుని పాదసన్నిధిలో తాను కోసిన తామర పూవును సమర్పించాడు, ఆ తరువాత అతడు కూడా శాపవిమోచనాన్ని పొంది, మోక్షాన్ని పొందాడు. ఈ కథ అందరికీ తెలిసినదే.

ఇందులో గమనించదగిన ఒక అర్థం ఉన్నది. భగవత్సంబంధం కంటే, భాగవత సంబంధం, ఆచార్య సంబంధం అనేవి వేగంగా మోక్ష సిద్ధికి కారణాలు అనేది సంప్రదాయికమైన అర్థం. భగవంతునకు తనను భజించే భక్తుని విషయంలో కంటే, తన భక్తుని సేవించే భక్తుని విషయంలో ప్రీతి అధికంగా ఉంటుంది. " మే భక్తభక్తభక్తేషు ప్రీతి రభ్యధికా భవేత్" అని భగవంతుడే ఈ విషయాన్ని స్వయంగా చెప్పాడు.

గజేంద్రుడు భగవంతుని పాదాలను ఆరాధించాడు. అయినప్పటికీ, అతనికి ముక్తి ముందుగా కలుగలేదు. ప్రతికూలమైన భావనతో పొందినా, మొసలి భగవద్భక్తుడైన గజేంద్రుని పాద సంబంధాన్ని పొందింది. గజేంద్రుని కాలిని అది నోటితో పట్టుకున్నది కదా. ఆ విధంగా దానికి కలిగిన భాగవత సంబంధం కారణంగా మొసలికే ముందుగా మోక్షం లభించింది. భగవత్పాద సంబంధం ఉన్నప్పటికీ, గజేంద్రునకు ఆ తరువాతనే మోక్షం సిద్ధించింది. ఇది భాగవత శ్రీపాద సంబంధ మహిమను వ్యక్తం చేస్తున్నది.

భగవద్భక్తుని సంబంధం వ్యతిరేక క్రమంలో కలిగితేనే ఇంతటి గొప్ప ఫలం సిద్ధించినప్పుడు, ఇక, అనుకూలమైన భావనతో భగవద్భక్తుని ఆరాధిస్తే, ఎంతటి గొప్ప ప్రయోజనం సిద్ధిస్తుందో చెప్పనక్కరలేదు.

★★★★★

# 11. ఆళ్వారులు–వేదాలు – 1

భగవానుడైన శ్రీమన్నారాయణుని నిర్హేతుక కృపవల్ల ఎటువంటి భ్రమ, ప్రమాదం మొదలైన దోషాలు లేని, భక్తిరూపంగా పరిణమించిన జ్ఞానాన్ని కలిగిన ఆళ్వారులు భగవంతుని అభినవ దశావతారాలుగా కీర్తింపబడుతున్నారు. ఆ భగవంతుని విషయంలో అంతు లేని ప్రేమను కలిగినవారై, అనేక విధాలుగా ఆ స్వామిని దర్శించి, ఆనందించి తమ పాశురాలలో వారు తమ అనుభవాన్ని వ్యక్తం చేస్తున్నారు. భగవంతుడు తానే తనను కీర్తించుకునే ఉద్దేశంతో ఆళ్వారుల రూపంలో అవతరించినట్లుగా మన పూర్వాచార్యుల అభిప్రాయం. ఎందుకంటే, భగవంతుని వైభవాన్ని ఒకవేళ చెప్పగలిగితే, ఆ భగవంతుడే కదా కొంతవరకైనా చెప్పగలడు. భగవంతుని స్వరూపరూప గుణ విభూతి ఐశ్వర్య లీలలను దర్శించి ఆనందించిన ఆ దివ్యసూరులు ఆ విధమైన అనుభవాన్ని తమకు ధారక పోషక భోగ్యాలుగా గ్రహించారు. అందువల్ల వారి జన్మ వృత్తాలు అన్నీ విలక్షణమైన వైభవాన్ని కలిగినవిగా ప్రకాశిస్తున్నాయి. వారి భగవదనభవం తమకు ఇష్టం వచ్చినట్లుగా ఆవిర్భవించలేదు. తమకు తోచినట్లుగా వారు పాశురాలను పాడలేదు. వేదం అనుభవించిన రీతిలోనే వారి అనుభవం కూడా సాగింది. అందుచేత వారి దివ్య సూక్తులకు ప్రత్యేకమైన వైభవం ఏర్పడింది.

నమ్మాళ్వారుల దివ్యసూక్తులను చాలా లోతుగా అవగాహించి పలికే మధురకవి ఆళ్వారులు "అరుట్కొండాడుమ్ అడియవర్ ఇన్బుఱ అరుళినాన్ అవ్వరు మఱైయిన్ పొరుళ్, అరుట్కొండు ఆయిరమ్ ఇన్ తమిழ் పాడినాన్", "మిక్క వేదియర్ వేదత్తినుట్పొరుళ్ ––– ఎన్ నెంజిల్ నిఱుత్తినాన్" (కణ్ణినుణ్ శిఱుత్తాంబు–8, 9) అని అన్నారు. ఇక్కడ గొప్పతనాన్ని కలిగిన వేదంలోని అర్థాన్ని చాలా దయతో తీయని ద్రావిడ భాషలో నమ్మాళ్వారులు గానం చేశారు– అని అనడం వేద ప్రామాణ్యంలో ఆళ్వార్లకు ఉండే ప్రాణ్యాన్ని తెలుపుతున్నది. వేదంలోని అంతరార్థాలను " ఎన్ నెంజుళ్ నిఱుత్తినాన్"– నా మనసులో పదిలంగా ఉండేటట్లు చేశారు– అని అనడం కూడా వేదంలో వారికి ఉండే అభినివేశాన్ని తెలుపుతున్నది. నమ్మాళ్వారుల విషయంలో మాత్రమే ఈ పాశురం ఆవిర్భవించినప్పటికీ, ఇందులో చెప్పబడిన అర్థం మిగిలిన ఆళ్వారులు అందరి విషయంలోనూ పరిపూర్ణంగా అన్వయించడాన్ని మనం గమనించవచ్చు. అంటే, మిగిలిన ఆళ్వారుల అందరి అనుభవాలు కూడా వేదప్రతిపాదితార్థాలను అనుసరించడాన్ని గమనించవచ్చు.

వేదం అనేది భగవదనుభవ ప్రధానమైన గ్రంథం. భగవదనుభవవిషయంలో అది ప్రత్యేకమైన మార్గాన్ని అనుసరించింది. , దోషం లేని భక్తి రూపంగా పరిణమించిన జ్ఞానాన్ని

కలిగిన దివ్యసూరులు ఇటువంటి వేదమార్గంలోని మహిమను పరిపూర్ణంగా తెలుసుకొని, ఆ దారిదోనే తాము కూడా పలికారు. ద్రావిడ దేశంలో పుట్టిన ఈ దివ్య సూరులు తాము పొందిన ఈ భాగ్యాన్ని ఆ దేశంలో ఉండే అందరూ అనుభవించి, ఆనందించాలి అనే అపారమైన కరుణతో, ఉదారమైన హృదయంతో సంస్కృత వేదంలో ఉండే అర్థాలను దేశ భాష అయిన ద్రావిడ భాషలో వ్యక్తం చేశారు. వేద సంబంధం లేని మార్గంలో వారికి ఎటువంటి ఆసక్తి కాని, దృష్టి కాని లేదు. వారి కాలంలో వేదాలకు బాహ్యంగా ఉండే ఎన్నో సిద్ధాంతాలు ఉన్నప్పటికీ కూడా, వాటిని అన్నిటిని బహిష్కరించి, శుద్ధమైన వైదికమార్గాన్నే వారు అనుసరించారు, ఆదరించారు. "మిక్క వేదియర్", " నన్మైయాల్ మిక్క నాన్మఱైయాళర్"(మధురకవి ఆళ్వారులు), " మిక్కార్ వేద విమలర్" (తిరువాయ్ మొழி_ 2 –9 –8) అని నమ్మాళ్వార్లు పలికిన సూక్తులు ఈ అందమైన అర్థాన్ని వ్యక్తం చేస్తున్నాయి. వేదబాహ్యశాస్త్రాలను కంటితో కూడా చూడకుండా, చెవితో కూడా వినకుండా, నిత్య నిర్దోషమైన వేద ప్రమాణ నిష్ఠులై వారుఉండడం వేదబాహ్య మతాలలో వారికి ఉండే వెగటును తెలుపుతున్నది. బౌద్ధులు, జైనులు వేద వైదిక క్రియా కలాపాలను నిరసించారు. దూషించారు కూడా. దానికి విరుద్ధంగా, ప్రతిగా దివ్యసూరులు వైదిక కార్యక్రమాలను, వైదికుల ఆచరణలను పలు విధాలుగా పొగడారు. త్రేతాగ్ని సాధ్యమైన జ్యోతిష్టోమాది యాగాలు నిర్వహింపబడడం చేత దివ్య క్షేత్రాలకు పవిత్రత, వైలక్షణ్యం కలిగినట్లు పలు సందర్భాలలో అభిప్రాయపడ్డారు, వర్ణించారు కూడా.

"వేదనూల్ ఓదుకిన్దదు ఉణ్మై అల్లదిల్లై మఱ్ఱు ఉరైక్కిన్టేన్" (వేదమనే శాస్త్రం పలికేది ఏది అసత్యం కాబోదు, తెలుపుతున్నాను) (తిరుచ్ఛంద విరుత్తమ్– 72) అని మహీసారమునింద్రులు స్పష్టంగా దీనిని పలికారు. ఈ విధంగా వేద ప్రామాణ్యంలోనూ, వేదమార్గంలోనూ నిష్ఠను కలిగినవారై ఉండడం, ఆరీతిలో ఆళ్వార్లు తమ సూక్తులను పలకడం అనేది వేదం లోని గొప్పతనాన్ని వారు పలు విధాలుగా తెలుసుకొని ఉండడాన్ని స్పష్టం చేస్తున్నది. దీనిని దృష్టిలో పెట్టుకుని శ్రీమణవాళ మహామునులు కూడా "ఆద్యస్య నః కులపతేః" అనే సూక్తికి "వైదిక సంతాన సకూటస్థులు "అనే అర్థాన్ని అనుగ్రహించారు. నమ్మాళ్వారులను వైదిక సంతాన కూటస్థులుగా అనుభవించడంలో విలక్షణమైన ఆనందాన్ని అనుభవించారు.

ఆళ్వారులు, భగవంతుని తమ అభిప్రాయంలో కల్పింపబడినవానినిగా భావించకుండా, "వేదియర్ ముழுవేదత్తిన్ అముదమ్" గా భావించి, అనుభవించడం వైదికులు, వేదం – అనే వీటి విషయంలో వారికి ఉండే ఆదరాతిశయాన్ని తెలుపుతున్నది.

తరువాత రాబోయే వ్యాసాలలో అళ్వార్లకు వేదాల పట్ల, వైదికుల పట్ల, వేదసిద్ధాంతాల పట్ల ఉండే ఆదరాన్ని తెలిపే మరి కొన్ని అంశాలను అనుభవిద్దాం, స్వస్తి.

★★★★★

# 12. ఆళ్వారులు–వేదాలు – 2

## నాలుగు వేదాలు,

వాటి అనేక శాఖలు, ఆ శాఖలలో ఉండే అనేక భాగాలు, ఆరు వేదాంగాలు, వైదిక క్రియా ళలాపాలు అనే ఇవి అన్నీ కూడా ఆళ్వారుల విశేషమైన అనుభవానికి విషయాలైనవి. వారి అనుభవంలోని గాంభీర్యాన్ని ఇవి తెలుపుతున్నవి. వేద సంబంధాన్ని కలిగి ఉన్నందుచేత వైదికులకు గొప్పతనం కలిగింది అని కూడా వారు పలకడం గమనించదగిన విషయం. భగవంతుడు వేద ప్రతిపాద్యుడు అని అనడంతో మాత్రం నిలువకుండా, వేదం, వైదిక క్రియాకలాపాలు వైదికులు, అందరూ భగవంతుని అవతార రూపాలే అనే అవధికి ఆళ్వారుల అభిప్రాయం ఉన్నతంగా ఉండడాన్ని గమనించవచ్చు. వేదార్థాలు కూడా భగవత్స్వరూపాలే అని వారు భావించారు. వేద ధ్వనిలో తాము అభినివేశాన్ని పొందడంతో పాటు, భగవంతునకు కూడా ఆ వేదాలను ఆలకించడంలో చాలా ఆదరం ఉన్నట్లుగా కూడా వారు భావించి, పలుకుతారు.

భగవంతుని స్వరూపం అపరిచ్ఛేద్యం. అది "ఇంత మాత్రమే" అని ఎవరికి తెలుసుకోవడానికి సాధ్యం కానిది. శబ్ద ప్రమాణానికి, ప్రత్యక్షం మొదలైన ప్రమాణాల కంటే వైలక్షణ్యం ఉన్నప్పటికీ కూడా, దానికి కూడా స్వభావసిద్ధమైన కొన్ని కొరతలు ఉన్నందువల్ల, ఏ శబ్దం కూడా భగవంతుని పూర్ణంగా తెలుపలేదు. వేదం కూడా భగవంతుని అపరిచ్ఛేద్యుడు అని మాత్రమే చెబుతున్నది. మనస్సు కాని వాక్కులు కాని పరమాత్మ దరిదాపులకు చేరలేవు–అని ఆ వేదమే చెబుతున్నది. స్వరూపంతోనూ, గుణాలతోనూ లెక్క కట్టడానికి సాధ్యం కాకుండా ఉన్నవానిని ఎవరు ఏ విధంగా పరిచ్ఛేదించి తెలుసుకోవడానికి సాధ్యం అవుతుంది? ("యతో వాచో నివర్తన్తే"– అని వేదమే చెప్పింది) దివ్యసూరులుకూడా ఈ మార్గంలోనే "ఇఱైనిలై ఉణర్వరిదు" – భగవంతుని స్వరూపాన్ని తెలుసుకోవడం సాధ్యం కాదు– అని అన్నారు. భగవంతుని పరిపూర్ణంగా చెప్పడానికి సాధ్యం కాదు అని వేదాలు చెప్పిన అభిప్రాయాన్ని మనసులో పెట్టుకొని తిరుమంగై ఆళ్వార్లు కూడా, " నాన్మఱైయుమ్ తొడరాద బాలకనాయ్" (4– 1– 8) అని, " నాన్మఱైకళుమ్ తేడి కాణమాట్టా చ్చెల్వన్" (4–8–7) అని అన్నారు. అయితే, మిగిలిన చోట్ల వీరే వేదప్రతిపాద్యత్వాన్ని పలు విధాలుగా నిరూపించడం అనేది ఏమి అని అంటే, ఆపరిచ్ఛేద్యుడైన ఆ భగవంతుని తమకు అందినంత పరిధిలో అనుభవిస్తున్నారు అని దీనివల్ల తెలుస్తున్నది. భగవంతుడు అపరిచ్ఛేద్రుడు అని వేదాలు చెప్పడాన్నే వారు కూడా అనుసరించి పలకడం వారి అభిప్రాయాలలోని, ఆలోచనలలోని వైదికత్వాన్ని తెలియజేస్తున్నది. వేదాలు కూడా, అన్వేషించి తెలియడానికి సాధ్యం కాని వాడు, భగవానుడు – అని అన్నందు వల్ల వేదంలోని గొప్పతనం వ్యక్తం

కావడంతో పాటు, భగవంతుని గొప్పతనం కూడా వ్యక్తమవుతున్నది. వేదం అన్వేషించినా తెలుసుకోవడానికి సాధ్యం కానివానిని దర్శిస్తున్నాను –అని ఏ ఆళ్వార్లు కూడా చెప్పకపోవడం గమనించదగినది. వేదం ఏ విధంగా దర్శించిందో, ఆ విధంగానే తాము కూడా దర్శించినట్లుగానే తెలియజేశారు, వారు.

ఆళ్వారులు అనుగ్రహించిన దివ్యప్రబంధాలు ద్రావిడ భాషలోని వేదాలు అని ఉభయ సంప్రదాయానికి చెందినవారైన ఆచార్యులు కూడా అంగీకరిస్తున్నారు. అయితే, వారు, సంస్కృత వేదంలోని అర్థాలను వేరు భాషలో వ్యక్తం చేసే వేదం అని కానీ, వేదంలోని అర్థాలను వివరించి తెలుపడం కోసం వచ్చిన ద్రావిడ భాషలో ఉండే వేదం అని కానీ ఒప్పుకుంటున్నారు. ఏ విధంగా అయినా, సంస్కృత వేదంతో సంబంధం కలిగిన వేదం అని వారు అంగీకరించడం కాదనడానికి వీలులేని విషయం. సంస్కృత వేదంలోని అర్థాలను ద్రావిడ భాష వ్యవహారంలో ఉన్న ద్రావిడ దేశంలో ప్రచారం చేయడం కోసం ఆళ్వార్ల దివ్య ప్రబంధాలు చాలా ఉపయోగపడుతున్నాయి. దివ్య సూరుల దివ్య ప్రబంధాలు ద్రావిడ దేశంలో ఉండే ప్రజలకోసం వారి భాషలో రచింపబడినవై వేదానికి ఆ ప్రాంతంలో సుస్థిరమైన స్థానాన్ని కలిగించినవి అనే విషయం చరిత్ర ద్వారా తెలియజేయబడిన వాస్తవం. వేద సంబంధమైన, పలు విధాలయిన అర్థాలను ఆళ్వార్లు తమ ప్రబంధాలలో అనేక సందర్భాలలో తెలియజేశారు. ఆ విధంగా వేదార్థాలను వ్యక్తం చేసే పాశురాలను ఒకటిగా చేసి వాటిలో దివ్య సూరులు వ్యక్తం చేసిన అర్థాలను తెలియజేయడమే ఈ ప్రయత్నంలోని ఉద్దేశ్యం. ఆళ్వార్లు వేరు వేరు కాలాలలో అవతరించి, భగవంతుని అనుభవం పొందినప్పటికీ, వేద సంబంధం కలిగిన అర్థాలనే వారు ప్రకటించడంలో వారికి ఉండే ఐకమత్యాన్ని మనం గమనించవచ్చు. ఇందువల్లనే నాలాయిర పాశురాలు అన్నీ ఒకే గ్రంథంగా ప్రకాశిస్తున్నాయి అని తెలియడంతో పాటు, వేదార్థాలను వ్యాపింపచేసే లక్ష్యంతోనే అవి ఆవిర్భవించాయి అనే విషయం కూడా ఇక్కడ వ్యక్తమవుతున్నది.

వేదసంబంధం కలిగిన దివ్యసూరుల పాశురాలను మూడు విధాలుగా విభాగించి, ఈ గ్రంథంలో ప్రతిపాదనం చేయబడుతున్నది. మొదటి భాగంలో, ఆధారంగా ఉండే కొన్ని అర్థాలను వివరించడం జరుగుతుంది. రెండవ భాగంలో "వేదం, వైదికక్రియలు" అనే వీటిని ఆధారంగా చేసుకుని సంబంధాన్ని పురస్కరించుకొని దివ్య క్షేత్రాలను నిరూపించే సందర్భాలను, ఆ యా దివ్య దేశాల వర్ణిస్తూ ఆళ్వారుల అనుగ్రహించిన పాశురాలను పురస్కరించుకొని వివరించడం జరుగుతుంది. మూడవ భాగంలో నాయికాదశను పొందిన సమయంలో కానీ, వేరు దశను పొందిన సమయంలో కానీ, ఆళ్వార్ల పాశురాలను పలికేటప్పుడు కూడా వారికి కల వైదికమైన అభినివేశం ఎటువంటిదో తెలియజేయడం జరుగుతుంది. ఇక, చివరిగా, వేద సంబంధమైన అర్థాలను తెలిపే పాశురాలను,

పాశురభాగాలను కూర్చి ప్రస్తావించడం జరుగుతుంది ఆ పాశురాలను, పాశుర భాగాలను వివరించే సందర్భంలో పలుచోట్ల వ్యాఖ్యానాలలోని వాక్యాలను కూడా ప్రస్తావించడం జరుగుతుంది.

★★★★★

# 13. ఆళ్వారులు–వేదాలు – 3

## శుడర్ మికు శురుది (గొప్పగా ప్రకాశించే వేదం)

వేదాన్ని ఆధారంగా చేసికొని ఏర్పడిన మతానికి వైదిక మతం అని పేరు. దానిని అనుసరించిన వారు వైదికులు అనబడతారు. అటువంటి వైదికులలో ఆళ్వార్లు అగ్రేసరులు. వైదికుల ఆలోచనలు అన్నీ వేదాన్ని అనుసరించే ఉంటాయి. ఏ అంశంలోనూ కూడా వేదాన్ని విడచి ఉండవు. బౌద్ధులు, జైనులు వేదాన్ని ప్రమాణంగా అంగీకరించలేదు. బుద్ధుని మహావీరుని తమ మతానికి మూలపురుషునిగా వారు అంగీకరిస్తారు. బుద్ధుడు, మహావీరుడు అనే వీరి మనసులో తోచిన అభిప్రాయాలను వారు అనుసరిస్తారు. వీరు వేదాన్ని అంగీకరించనందున వేద బాహ్యులు అని, అవైదికులు అని చెప్పబడుతున్నారు. వైదికులు ఎవరూ కూడా వైయక్తికమైన అభిప్రాయాలకు, మతాలకు ప్రాధాన్యాన్ని ఇవ్వరు. అతడు ఎంత గొప్పవాడు అయినప్పటికీ కూడా, అతని మాటలను ప్రమాణంగా అంగీకరించరు. మానవుడిగా పుట్టినవాడు ఎవడైనా సరే, అతనికి భ్రమ, ప్రమాదం, విప్రలిప్స మొదలైన దోషాలు సహజంగానే ఉంటాయి. కనుక వైయక్తికమైన అభిప్రాయాలను పరమ ప్రమాణంగా వైదికులు ఎంత మాత్రం అంగీకరించరు. వేదం శబ్ద కూటమై ఉన్నప్పటికీ, అది ఎవరి చేత రచింపబడినది కాదు. అది అనాది అయినది. వేదాన్ని అనే మూలంగా కల అభిప్రాయాలపై వైదిక మతం ప్రకాశిస్తున్నది. వేదం అనాది అయినది అని అంగీకరింపబడినట్లయితే, భగవంతుడు కూడా వేదాన్ని సృష్టించలేదు అని ఏర్పడుతున్నదికదా. ఆయా సృష్టికాలాలలో, అంతకుముందే ఉండే వేదాలను భగవంతుడు స్మరించి బ్రహ్మకు ఉపదేశం చేయడం ద్వారా వ్యక్తం చేస్తున్నాడు. భగవంతుడు అనేక విధాలయిన అవతారాలను చేయడం కూడా వేదాన్ని, వైదిక ధర్మాలను రక్షించడం కోసమే. అవతారాలు భగవంతుని సంబంధించినవి అయినప్పటికీ, ఆ యా అవతారాలలో సహజంగా ఉండే కొరతలను భగవంతుడు మార్చుకోవడం లేదు. అందుచేత అవతారకాలాలలో భగవంతుడు చెప్పే వాక్యాలు వేదంగా కావడం లేదు. పరిగణింపబడడం లేదు. అవతార కాలాలలో చెప్పే అర్థాలు వేదంతో సమన్వయించి ఉంటేనే, వాటిని వైదికులు ప్రమాణంగా గ్రహిస్తారు. వేదవిరుద్ధంగా అవి ఉన్నట్లయితే, వైదికులు వాటిని గ్రహించడం లేదు. భగవంతుడు గీతలో చేసిన ఉపదేశం వైదిక సిద్ధాంతాలను అనుసరించి ఉన్నందువల్ల వాటిని వైదికులు ప్రమాణంగా ఒప్పుకుంటున్నారు. భగవంతుడు ఇంకొక అవతారమైన కపిలావతారంలో చేయబడిన ఉపదేశాలు వేదవిరుద్ధంగా ఉన్నందువల్ల వాటిని వైదికులు

అంగీకరించరు. అవతారాలలోని ఉపదేశాలకు వేదమూలంగానే ప్రామాణ్యం ఏర్పడుతున్నందున, వాటిని స్మృతులు అని అంటున్నాము. వేదం స్వతః ప్రమాణం. స్మృతులు వేదం ద్వారా ప్రమాణాలు. ఇతిహాస పురాణాలు కూడా స్మృతులే. మహర్షుల వాక్యాలు, భగవంతుని వాక్యాలు స్మృతులే అవుతున్నవి. వేదానికి ప్రామాణ్యం సహజంగా ఏర్పడినట్లుగా, ప్రత్యక్షం, అనుమానం అనే వీటికి సహజంగా ప్రామాణ్యం ఏర్పడడం లేదు. వేరు కారణాలను పురస్కరించుకొని ప్రత్యక్షం, అనుమానం అనే వీటిచేత ఏర్పడే అనుభవాన్ని పరీక్ష చేసి, అవి దోషం లేనివి అని ఏర్పడితే, వాటిని ప్రమాణంగా స్వీకరించడం జరుగుతుంది. ఆ విధంగా కాకుండా, దోషం కలిగినవి అని ఏర్పడితే, వాటిని విడచిపెట్టడం జరుగుతుంది. వేదంలోని ఉపదేశాలకు వేరొక ప్రమాణాలతో శోధనం జరుగదు. వేదంలో చెప్పబడేదాన్ని ఆ విధంగానే ప్రమాణంగా మనం అంగీకరిస్తున్నాము. వేదం తానుగానే ప్రకాశించడం అనేది దానికి ఉండే విలక్షణమైన గొప్పతనం. ఈ గొప్పతనాన్ని అనువదిస్తూ నమ్మాళ్వార్లు "శుడర్ మికు శురుది" అని అనుగ్రహించారు. హేత్వంతరాలతో విడచి పెట్టవలసిన ఆవశ్యకత లేని గొప్పతనాన్ని కలిగినది– అనే విషయాన్ని తెలియజేయడం కోసం "ప్రకాశంతో నిండి ఉండే వేదం " అని ఆళ్వారులు అన్నారు. ఇక్కడ వేదం శ్రుతి అనే శబ్దంతో చెప్పబడినది. ఈ శ్రుతి అనే శబ్దం శ్రవణం మూలంగా వేదం వచ్చింది అనే విషయాన్ని తెలియజేస్తున్నది. ఆచార్యుడు తన శిష్యునకు ఉపదేశిస్తున్నాడు. దానిని శిష్యుడు విని, మళ్ళీ దానిని తిరిగి చెబుతున్నాడు. ఈ విధంగా పూర్వ పూర్వ ఉచ్చారణ క్రమాన్ని అనుసరించి, ఉత్తరోత్తర ఉచ్చారణం చేయబడడం అనే రీతిని ఆధారంగా చేసుకుని శ్రుతి అని వేదం చెప్పబడుతున్నది. " శుడర్ " అనే పదం ప్రకాశం అనే అర్థాన్ని ఇస్తున్నందున, సంశయం, విపర్యయం అనే దోషాలు లేని అర్థాలను వేదాలు వ్యక్తం చేస్తున్నాయి అని చెప్పబడినట్లయినది. ఈ వేదాల ప్రకాశం ఏనాడు తరగని, ఆరిపోని ప్రకాశం.

### భగవంతుడు వేదదీపం

వేదం అనేది స్వతః ప్రమాణమైనది. తనకు తానే ప్రమాణం. మిగిలిన వేదాంతార్థాలకు కూడా వేదమే ప్రమాణం. దీనిని మనస్సులో పెట్టుకున్న ఆళ్వారులు వేదాన్ని ఒక దీపంగా నిర్దేశించారు. రూపణం చేశారు. దీపం చీకటిని పోగొట్టి, ఆ యా పదార్థాల స్వరూప స్వభావాలను యథాతథంగా తెలియజేస్తుంది. అంతేకాకుండా, తనకు తానే ప్రకాశిస్తుంది. దీపం లేకుండా ఉంటే అంతటా చీకటి వ్యాపిస్తుంది. ఆ విధంగానే, వేదం అనే ప్రమాణం లేకుండా ఉంటే, లోకంలో ఉండే వస్తువులను గూర్చి మనం తెలుసుకోవడం అనేది ఎంత మాత్రం సాధ్యం కాదు. దీపప్రకాశం చీకటిని పోగుడుతున్నది. వేదాలు

అజ్ఞానాన్ని పోగొడుతున్నవి. అందుచేత, పలుచోట్ల పలు పాశురాలలో ఆళ్వారులు వేదాన్ని దీపంగా పలుకుతున్నారు. "మఱైయాయ్ విరింద విళక్కై" వేదంగా విస్తరించిన దీపం), " వేదనల్ విళక్కే", " వేదాంత విఴుప్పొరుళిన్ మేలిరుంద విళక్కై", " నందా విళక్కు" అనే ప్రయోగాలు వేదాన్ని తెలుపుతున్నట్లుగా శ్రీవరవరమునులతో సహా పూర్వాచారు అందరూ అభిప్రాయపడడానికి భగవంతుడు వేదదీపంగా ప్రకాశించడమే కారణం.

★★★★★

# 14. ఆళ్వారులు–వేదాలు – 4

## హంసగా, హయగ్రీవుడుగా అవతారాలను ఎత్తి భగవానుడు వేదాలను ఉపదేశించాడు.

వేదం నిత్యమైనది అనేది వైదికుల మౌలికమైన సిద్ధాంతం. శ్రుతి స్మృతి ఇతిహాస పురాణాలు ఈ సిద్ధాంతాన్ని పలు విధాలుగా వివరిస్తున్నాయి. ప్రళయ కాలంలో వేదం అంతర్హితమవుతుంది. మళ్లీ సృష్టిని ఆరంభించే కాలంలో, ఆ వేదాలను భగవంతుడు బ్రహ్మకు ఉపదేశిస్తున్నాడు. వేదాలలో ఆయా కాలాలతో సంబంధం ఉండే పలు విధాలైన కథలు ఉన్నట్లుగా మనకు కనిపించినా, ఆయా కాలాలలో వేదం సంభవించినట్లుగా మనం భావించకూడదు. వేదం పుట్టుక, నాశం లేని ఒక గ్రంథం అనే సిద్ధాంతానికి అనుగుణంగానే ఆ వృత్తాంతాలకు వివరణను చెప్పాలి– అని బ్రహ్మసూత్ర కారులు తెలియజేశారు. అందువల్ల భగవంతుని వలె వేదం కూడా అనాది అయినది. ప్రళయ కాలంలో వేదం అంతర్హితమై పోతున్నది. మళ్లీ సృష్టించే కాలంలో భగవానుడు కొన్ని అవతారాలను ఎత్తి, ఆ వేదాన్ని బ్రహ్మకు మళ్ళీ ఉపదేశిస్తున్నాడు. హంసరూపాన్ని ధరించి, హయగ్రీవ రూపాన్ని ధరించి భగం భగవంతుడు వేదాలను బ్రహ్మకు ఉపదేశం చేస్తున్నాడు అని పురాణాలు తెలియజేస్తున్నాయి. ఆళ్వార్లు కూడా ఈ క్రమాన్ని అనుసరించి పలుకుతున్నారు.

"అన్నమాయ్ అంగు నిన్ఱు అరుమఱైనూల్ పయందాన్" ((పెరియ తిరుమొழி –5 –7 –3) అని అంటూ హంసావతారాన్ని గూర్చి తిరుమంగై ఆళ్వారులు ప్రస్తుతించారు. ఆ విధంగానే, హయగ్రీవరూపంలోని అవతారాన్ని ఎత్తి భగవానుడు వేదాలను ఉపదేశించిన వృత్తాంతాన్ని కూడా దివ్యసూరులు తమ ప్రబంధాలలో ప్రస్తావన చేశారు. విస్తరించిన కళలను కలిగినవై, నాలుగై ఉండే వేదాల అర్థాన్ని అంతటినీ భగవానుడు హయగ్రీవ రూపాన్ని ధరించి అనుగ్రహించాడు –అని తిరుమంగై మన్నన్ "పన్ను కలై నాలువేద ప్పొరుళై ఎల్లామ్ పరిముకమాయ్ అరుళియ ఎంబెరుమాన్ కాణ్మిన్" (7– 8 –2) అని మొదలైన పాశురాలలో పలికారు.

### వేదాలలో ప్రతిపాదింపబడే పదార్థాలుగా భగవంతుడు ప్రకాశిస్తున్నాడు.

అనాది అయిన వేదమే సృష్టికి కూడా మూల ప్రమాణంగా ఉన్నది అనే విషయం కూడా వైదిక మతంలోని మౌలికమైన సిద్ధాంతం. భగవంతుడు వేదాన్ని పురస్కరించుకునే ఆయా పదార్థాలను సృష్టించాడు. సద్రూపంగానూ, అసద్రూపంగానూ ఉండే పదార్థాలతో

నిండిన లోకాన్ని భగవానుడు వేదాన్ని పురస్కరించుకునే సృష్టించాడు– అని వేదమే చెబుతున్నది. మనువు కూడా ఈ దారిలోనే పలుకుతున్నాడు. "వేదశబ్దేభ్య ఏవాథౌ పృథక్ సంస్థాం చ నిర్మమే" అని అంటూ ఈ విషయాన్ని స్పష్టం చేశాడు. ఈ విధంగా జగత్తులోని వస్తువులు అన్నీ వేదంలో చెప్పబడినవే. భగవంతుడు లోకంలో ఉండే వస్తువులుగా అయ్యాడు అంటే, వేదపదార్థాలుగా అయ్యాడు అనే గ్రహించాలి. సాధారణంగా లోకంలో ఉండే వస్తువులుగా భగవంతుడు అయ్యాడు– అని పలుచోట్ల చెప్పబడేటట్లే, వేదవస్తువులుగా భగవంతుడు అయ్యాడు అని వేదశబ్దాన్ని పురస్కరించుకొని ఆళ్వారులు సృష్టిని అనుభవించడాన్ని కూడా గమనిస్తున్నాము. "పన్ను నాన్మఱై పల ప్పొరుళాగియ" (3–1–2), " ఎழில் వేద ప్పొరుళ్ గళుమాయ్" (4–1–) అని పెరియ తిరుమొழி ప్రబంధంలో తిరుమంగై మన్నన్ అనుగ్రహించారు. ఒక్కొక్క వస్తువులోనూ అంతర్యామిగా భగవంతుడు నిలచి ఉన్నవాడై ఉన్నందున అన్ని వస్తువులకు భగవానుడే అవుతున్నాడు. ధీనిని కూడా వేదసంబంధంతో దివ్యసూరులు అనుభవించి పలుకుతున్నారు.

## వేదప్రతిపాదితమైన మహాతత్త్వార్థం భగవానుడే

వేదప్రతిపాద్యత్వం అనేది భగవంతునకు ఒక విలక్షణమైన గొప్పతనాన్ని కలిగిస్తున్నది. నిత్యమై, నిర్దోషమై ఉండే వేదంలోని గొప్పతనాన్ని తెలుసుకున్న దివ్యసూరులు భగవంతునకు ఉండే వేద ప్రతిపాద్యత్వాన్ని చాలా గొప్పగా పలుకుతున్నారు. భగవంతుడు " మఱైయిన్ పెరుమ్ పొరుళ్" అని అంటున్నారు. " "ఏలుమఱై ప్పొరులే" (పెరియాழ் వార్ తిరుమొழி 1 –9), " (వేదప్పొరుళే– 2 –9), "నాన్మఱైయిన్ పొరుళాయ్" (నాచ్చియార్ తిరుమొழி–4–10), " శామవేద గీతన్ శక్కర పాణి" (తిరుచ్చంద విరుత్తమ్– 14), " వేద గీతన్ " (తిరుచ్చంద విరుత్తమ్– 117), " నన్గు ఓదుమ్ నాల్వేదత్తుళ్ ఉళ్ళాన్" (మూన్ఱామ్ తిరువందాది–11), " నాల్ వేదత్తినుళ్ళాన్ "(31), " మఱై ప్పెరుమ్ పొరుళై" (పెరియ తిరుమొழி–4–3–2), " అంగమాఱు వేదనాన్గు మాగి నిన్ఱు అవఱ్ఱుళే తంగుకిన్ఱ తన్మైయాక" (తిరుచ్చంద విరుత్తమ్–15), " మఱైయాయ నాల్ వేదత్తుళ్ నిన్ఱ మలర్ చ్చుడరే" (తిరువాయ్ మొழி– 3–1–10) అని మొదలైన దివ్యసూరి సూక్తులు ఈ విషయాన్ని ఘోషిస్తున్నాయి. ఈ విధంగా భగవంతుని వేదప్రతిపాద్యునిగా పలికి ఆళ్వార్లు అనుభవించడాన్ని మనం గమనిస్తున్నాము.

వేదాలలో పలు పదార్థాలు చెప్పబడుతున్నాయి. ఇవి అన్నీ రూపాన్ని కలిగినవి. సృష్టికాలంలోనే ఇవి రూపాన్ని పొందుతున్నాయి. భగవంతుడు ఒక విలక్షణమైన రూపాన్ని

పరిగ్రహించి, మొదట సృష్టించడంచేత అతడు సృష్టికి ఆరంభ కాలంలో మూలంగా ఉన్నాడు. "ప్రథమజా ఋతస్య" అని వేదమే చెబుతున్నది. ఈ విషయాన్ని కూడా ఆళ్వార్లు మనస్సులో పెట్టుకొని, భగవంతుని "వేదముదల్వన్" అని కీర్తిస్తున్నారు. " వేదముదల్వనై" (తిరువాయ్ మొళి–3–5–5), " వేదముదల్వర్" (నాచ్చియార్ తిరుమొళి– 10 –2) అని వేద శబ్దాన్ని పురస్కరించుకుని భగవంతుని జగత్కారణరూపునిగా అనుభవించడం కూడా ఆళ్వారుల ఒక విలక్షణమైన మార్గం.

★★★★★

# 15. ఆళ్వారులు–వేదాలు – 5

భగవంతుని అనేక విధాలుగా నిరూపణం చేసిన ఉపనిషత్తులు ఆ భగవంతుని రసస్వరూపిగా నిరూపించినవి. 'రసో వై సః" అని భగవంతుని రసస్వరూపునిగా స్తుతించినవి. ఈ అర్థాన్ని వివరించే సమయంలో, " ఈ రసాన్ని పొంది అనుభవిస్తేనే ఆనందం కలుగుతుంది" అని కూడా "రసం హి ఏవాయమ్ లబ్ధ్వా ఆనందీ భవతి ", అని ఉపనిషత్తు పలికింది. ఈ విధంగా భగవంతుని రసస్వరూపిగా పలకడం భగవంతుని భోగ్యత్వాన్ని తెలియజేస్తున్నది.

"జ్ఞాననిష్ఠలో నిలచి భగవంతుని గ్రహిస్తే చాలు" అని కొందరు భావిస్తారు. భగవంతుని అనుభవించాలని కొందరు కోరతారు. ఆళ్వార్లు ఆ విధంగా భగవంతుని అనుభవించాలని ప్రయత్నించి, భగవంతుని భోగ్యత్వాన్ని వ్యక్తం చేశారు. భగవంతుడు సత్య జ్ఞానానందామల స్వరూపుడుగా ఉండడంతో పాటు, రసస్వరూపిగా కూడా ఉండడం వారిని ఈ విధంగా ఆశపడేటట్లు, ప్రయత్నించేటట్లు చేస్తున్నది. ఈ మార్గంలో ప్రవేశించిన భక్తులు ఏయే వస్తువులు భోగ్యంగా లోకంలో కనిపిస్తున్నాయో, ఆ యా వస్తువులుగా భగవంతుని భావించి, , అనుభవించి పలుకుతారు.

లోకంలోని వస్తువులను అనుభవిస్తే కలిగే ఆనందం అనేది చాలా అనిత్యమైనది, అల్పమైనది కూడా. అయితే, భగవంతుని అనుభవించడం వల్ల ఏర్పడే ఆనందం నిత్యమైనది, సాటి లేనిది, అంతు లేనిది, " అరుమ్ కరుంబినై కనియై అముదప్పొదియిన్ శువైయుమ్" (పెరియ తిరుమొழி – 7 –10– 1), " పాలుమ్ తేనుమ్ కన్నలుమ్ అముదమాగి" (తిరువాయ్ మొழி– 4 –3 –10) అని అంటూ ఆళ్వారులు భగవంతుని అనుభవించి ఆనందిస్తారు. ఈ విధంగా భగవంతుని అమృతంగా అనుభవించే ఆళ్వార్లు వేదసంబంధంతో ఆ అమృతాన్ని అనుభవిస్తున్నారు.

"వేదియర్ ముழுవేదత్తు అముదత్తై" " (నమ్మాళ్వార్లు –2–5–4), " "అందణర్ తమ్ అమిరుతమ్" (పెరియాళ్వర్లు –5–4– 11) అని ఈ విధంగా పలు సూక్తులలో పలువురు ఆళ్వార్లు వేదసంబంధాన్ని పురస్కరించుకొని భగవంతుని అమృతంగా అనుభవిస్తారు.

అమృతం అనేది సముద్రాన్ని చిలికినప్పుడు ఆవిర్భవించింది. ఆ విధంగానే, వేదం అనే సముద్రం నుండి భగవంతుడు అనే ఈ అమృతం మథించి ఉద్ధరింపబడింది– అని మన

పూర్వాచార్యులు అంటారు. " భగవంతుడు పరమ భోగ్యమైనవాడు" అనే విషయాన్ని అమృతం అనే పదంతో వ్యక్తం చేయడం కోసం వేదప్రతిపాద్యత్వంవల్ల ఏర్పడిన గొప్పతనాన్ని వ్యక్తం చేయడం కోసం "వేదంనుండి లభించిన అమృతం" అని వారు అంటున్నారు. "అందణర్ తమ్ అమిరుతమ్"(విప్రుల అమృతం) అని అనడం కూడా, బ్రాహ్మణులకు మూలాధారమైన వేదాన్ని పురస్కరించుకొని పలికే ఈ మాటే, ఇక్కడ కూడా, వేదప్రామాణ్యం వేదం ద్వారా చెప్పబడింది. "భగవంతుడు అనేవాడు తమ మనసులోని భావన వల్ల ఏర్పడిన అమృతం కాదు, వేదంలోని అర్థాల నుండి లభించిన అమృతం సుమా!" అని అంటున్నారు.

వేదం అనేది, ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం అని 4 రీతులుగా ఉన్నది. ఆ విధంగానే, మంత్రాలు, బ్రాహ్మణలు, కర్మ భాగం, జ్ఞాన భాగం అని పలు విధాలుగా అది విభాగింపబడి ఉన్నది, మంత్ర భాగం భగవంతుని స్వరూపం మొదలైనవాటిని వ్యక్తం చేస్తూ పలికి, ప్రార్థనావిధానాన్ని తెలియజేసే భాగం. బ్రాహ్మణభాగం భగవదారాధనాత్మకమైన కర్మస్వరూపాన్ని తెలియజేస్తున్నది. జ్ఞానభాగం అనేది చిత్తు, చిత్తు, ఈశ్వరుడు అనే మూడు విధాలైన తత్త్వాలను నిరూపించి, భగవంతుని పొందే పలు ఉపాయాలను తెలుపుతున్నది. ఈ విధంగా ఒకే వేదం పలు విధాలైన దృష్టులతో పలుమార్గాలలో విభాగింపబడి ఉన్నందున, కొన్ని భాగాలకు భగవంతునితో సంబంధం ఉన్నదా? లేదా? అనే సందేహం రావడానికి అవకాశం ఉన్నందున, ఆ విధంగా ఏ విధమైన సందేహానికి అవకాశం లేకుండా చేయడం కోసమే అన్ని వేదభాగాలు ఏదో ఒక మార్గంలో భగవంతునే తెలుపుతున్నాయి– అనే విషయాన్ని తెలియజేయడం కోసమే ఆళ్వార్లు "ముఱ్ఱువేదత్తముదత్తై" (వేదం మొత్తం నుండి ఆవిర్భవించిన అమృతం) అని అన్నారు. వేదాల మంత్రాలు, ఋక్కు, యజుస్సు, సామ, అధర్వణ రూపంలో ఉన్నప్పటికీ, అవి అన్నీ చివరకు భగవంతునే తెలుపుతున్నాయి– అనే విషయాన్ని తెలియజేయడం కోసమే "నాల్ వేదక్కడల్ అముదత్తై" (నాలుగు వేదాలు అనే సముద్రంనుండి పుట్టిన అమృతాన్ని) అని చెప్పబడింది.

★★★★★

# 16. ఆళ్వారులు–వేదాలు – 6

## వేదం సాక్షాత్తు భగవంతుడే

"వేదమాగి వేళ్వియాగి" (తిరుచ్చంద విరుత్తమ్) వేదం ఆళ్వార్ల దివ్య సూక్తులలో ప్రముఖస్థానాన్ని అలంకరిస్తున్నది. వేదం చూపిన దారిలోనే దివ్యసూరుల అనుభవం కూడా వ్యక్తం అవుతున్నది. వారు దర్శించి అనుభవించే భగవంతుడు వేదప్రతిపాద్యుడు, ఇంతే కాదు, వేదమే భగవంతుని అవతార విశేషం అని దివ్య ప్రబంధాలలో అక్కడక్కడ వారు అనుగ్రహించారు.

దుష్టనిగ్రహం, శిష్టుల సంరక్షణ అనేవానిని అవతారాలలో భగవంతుడు నిర్వహిస్తున్నాడు. ధర్మానికి హాని, అధర్మానికి అభివృద్ధి ఏర్పడిన కాలంలో తాను అవతారాలను ఎత్తుతున్నట్లుగా భగవానుడు భగవద్గీతలో చెప్పాడు. అయితే, ఈ అవతారాలు ఆయా కాలాలలో ఆవిర్భవించి, తరువాత కొద్ది కాలానికి అదృశ్యమైనందున అవి తాత్కాలికమైనవి. అంతేకాదు, ఆయా అవతారాలకు చెప్పబడిన లక్ష్యాలు కూడా నిర్దిష్టంగా కొన్ని ఉన్నాయి. ఎన్ని అవతారాలు ఎత్తినప్పటికీ, అందులో ఏవో కొన్ని కొరతలను మనం గమనిస్తాము. అన్ని కాలాలలోనూ అందరికీ అన్ని విధాలైన కష్టాలను లేకుండా చేసి లోకాన్ని రక్షించడానికి విలక్షణమైన ఒక అవతారం స్వీకరించాలని అభిప్రాయబడిన భగవంతుడు వేదరూపమైన అవతారాన్ని ఎత్తాడు. లోక రక్షణవ్యాపారంలో ఆసక్తిని కలిగిన భగవంతునకు పలు విధాలైన అవతారాలు ఎత్తడం అనేది ఆవశ్యకం అయినది. వేదంగా అవతారం ఎత్తడం కూడా వీటిలో ఒకటి. లోకంలో ఉండే పదార్థాలలో అనుప్రవేశం చేసి ఆయా పదార్థాల రూపంగా భగవంతుడు అవుతున్నాడు. వేదమనే అవతారం అటువంటిది కాదు. ఇది ఒక విలక్షణమైన లక్ష్యాన్ని కలిగినది. జీవాంశాన్ని అధిష్ఠించకుండా నేరుగానే ఎత్తిన అవతారం ఇది. విష్ణు పురాణంలో భగవంతుడు వేదంగాను, యాగాలుగాను అవతారం చేస్తాడు అని పరాశరమహర్షి స్పష్టంగా చెబుతున్నారు. "వేదయజ్ఞమయం రూపమశేష స్థితౌ జగతః" దీనిని అనుసరించియే దివ్య సూరులు కూడా భగవంతుని వేదమై అవతరిస్తున్నాడు– అని చెప్పారు.

"నాన్గు మఱైయాయ్ వేళ్వియాయ్" (4–9–5) అని అన్నారు పెరియాళ్వార్లు. "మఱైయానాన్" (4–8) అని అన్నారు, కులశేఖరాళ్వార్లు. " వేద నాన్గుమాగి"(15), "వేద మాగి వేళ్వియాగి"(34), "ఇరుక్కలంద వేదనీతి యాగి నిన్ఱ నిన్మలా! "(103) అని అన్నారు, భక్తి సారమునీంద్రులు. " ఆరుమఱైయుమ్ అవైయుమానాయ్" (4–6–9), "

నాన్మఱైయానవనే" (6–1–6), " ఓదల్ శెయ్ నాన్మఱైయాగియుమ్" (6–1–9), " వేదముమ్ వేళ్వియుమానాన్"॥9–4–9), " వేదనాన్గాయ్" (తిరు నెడుందాండగమ్) అని అనేక సందర్భాలలో తిరుమంగైమన్నన్ ఈ అర్థాన్ని అనుసంధించారు.

★★★★★

# 17. ఉపనిషత్తులలోని సమతాదర్శనమ్ – 1

లక్ష్మీనాథసమారంభాం నాథయామున మధ్యమామ్,
అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్.
యం వాకేషూనువాకేషు నిషత్స్వపనిషత్సు చ,
గృణంతి సత్యకర్మాణం సత్యం సత్యేషు సామసు.

ఈ శ్లోకం మహాభారతంలో శాంతిపర్వంలో ఉన్నది. వేదాలు అన్ని భగవంతుడైన శ్రీమన్నారాయణుని గూర్చి తెలియజేస్తున్నాయని ఈ శ్లోకం తెలుపుతున్నది. వేదాలు అనేక విధాలుగా విభాగింపబడి ఉన్నాయి. ఈ శ్లోకం ఏమి తెలుపుతున్నదంటే, వేదం –వాకం, అనువాకం, సామ, నిషత్, ఉపనిషత్ అని 5 విధాలుగా వేదం విభాగింపబడి ఉన్నదని, ఈ ఐదు విధాలయిన విభాగాలు శ్రీమన్నారాయణుని గూర్చే పలుకుతున్నాయని తెలుపుతున్నది. వైదికమైన కర్మలను మనం ఆచరించేటప్పుడు ఉచ్చరింపబడే మంత్రాలకు వాకాలు అని పేరు. ఆ మంత్రాలలో తెలియజేయబడిన ఆజ్ఞలకు, నియమాలకు అనువాకాలు అని పేరు. ఇవే బ్రాహ్మణాలు. ఈ అనువాకాలు విధినిషేధాల రూపంలో ఉంటాయి. ఒక పనిని చేయమని కానీ, చేయవద్దని కానీ చెప్పబడే ఆజ్ఞలకు, నియమాలకు అనువాకాలు అని పేరు. ఉదాహరణకు, స్వర్గాన్ని పొందాలని కోరేవానిని జ్యోతిష్టోమ యాగాన్ని చేయమని వేదం చెబుతున్నది. ఇది వేదం విధించిన నియమం. ఈ విధంగానే వెల్లుల్లి వంటి కొన్ని వస్తువులను మనం భుజించకూడదని చెబుతున్నది. ఇది వేదం విధించిన నిషేధం. ఇటువంటి విధినిషేధాలే అనువాకాలు అనబడతాయి. ఇక, సామ అంటే, వేదాలలో గానం చేయబడే భాగాలు. ఈ మూడు పరబ్రహ్మను గూర్చి చెబుతాయి.

ఇక, నిషత్, ఉపనిషత్ అనే రెండు విభాగాలు ప్రస్తుత విషయాలు. నిషత్ అనే విభాగాలు పరమాత్మను గూర్చి పరోక్షంగా పలుకుతాయి, అంటే, అవి ఇంద్రుని గూర్చి, అగ్నిని గూర్చి, కుబేరుని గూర్చి, లేక, ఇంకొక దేవతను గూర్చి పలుకుతాయి, కాని, వాస్తవానికి అవి ఆయా దేవతలకు అంతర్యామిగా ఉండే పరమాత్మను గూర్చి తెలుపుతున్నాయని భావించాలి. ఇక, చివరి భాగం అయిన ఉపనిషత్ అన్య దైవాన్ని దేనిని ప్రస్తుతించదు. కేవలం పరమాత్మను గూర్చి పలుకుతుంది. అవి నేరుగా పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుని వైభవాన్ని గూర్చే తెలియజేస్తాయి. అందు చేత నిషత్ అనేది పరమాత్మను గూర్చి పలికే భాగం అయినప్పటికీ, అది నేరుగా పలుకకుండా, ఇతర దేవతలను ప్రస్తుతించడం ద్వారా పరోక్షంగా పరమాత్మను గూర్చి తెలుపుతున్నది. కానీ,

ఉపనిషత్ మాత్రం పరమాత్మను గూర్చి నేరుగానే తెలుపుతున్నది. ఈ అర్థం ఉపనిషత్ అనే పేరు వల్లనే సిద్ధిస్తున్నది. ఉప అంటే సమీపం అని అర్థం. నిషత్ అంటే కూర్చుని ఉండేది అని అర్థం. అందువల్ల ఉపనిషత్ అనే భాగాలు పరమాత్మకు అత్యంత సమీపంలో ఉంటాయి, అంటే, పరమాత్మను గూర్చి పరోక్షంగా కాకుండా, ప్రత్యక్షంగానే ప్రస్తుతిస్తాయి. పరమాత్మ వైభవాన్ని గూర్చి, అతడు చేసే లీలలను గూర్చి, ఆ స్వామి కళ్యాణ గుణాలను గూర్చి, పరోక్షంగా కాకుండా, ప్రత్యక్షంగానే పలుకుతాయి. ఇతర దేవతల ద్వారా కాకుండా నేరుగానే పలుకుతాయి. నిషత్ అనే విభాగం ఆ విధంగా కాకుండా, పరమాత్మను అంతర్యామిగా కలిగిన, పరమాత్మచే నియమింపబడే ఇంద్రాది దేవతలను గూర్చి పలకడం ద్వారా పరమాత్మ వైభవాన్ని తెలుపుతాయి. ఆయా దేవతలు చేసే కార్యాలను గూర్చి పలుకుతూ, ఆ యా దేవతలు ఆయా కార్యాలను భగవానుని నియమనం ప్రకారం నిర్వహిస్తున్నారని చెబుతాయి. అందువల్ల అవి పరమాత్మ వైభవాన్ని పరోక్షంగా చెబుతున్నాయి. ఉపనిషత్తులు ఆ విధంగా కాకుండా, భగవానుడైన శ్రీమన్నారాయణ వైభవాన్ని సాక్షాత్తుగానే కీర్తిస్తాయి. పరమాత్మ చేతనే ఈ జగత్తు అంతా సృష్టింపబడుతున్నదని, జగత్తు అంతా పరమాత్మచే ధరింపబడుతున్నదని తెలియజేస్తాయి. ఆ పరమాత్మను పొందడమే ముక్తి అని తెలియజేస్తాయి.

ఈ ఉపనిషత్తులకు వేదాంతాలు అనే పేరు కూడా ఉన్నది. ఇది చాలా ప్రసిద్ధమైన పేరు. వేదాంత శబ్దంలోని అంత శబ్దానికి నిర్ణయం అని అర్థం. అందుచేత వేదాంతం అంటే వేద నిర్ణయం అని అర్థం వేదాంతమనే పదానికి ఇక్కడ రెండు విధాలయిన అర్థాలు గ్రహించవచ్చు. అంత శబ్దానికి చివరి భాగం అని గ్రహిస్తే, వేదాంత శబ్దానికి వేదంలోని చివరి భాగం అని అర్థం వస్తుంది. అంత శబ్దానికి వేరొక అర్థం ఏమంటే, అంతకు ముందు ఏర్పడిన సందేహాలు అన్నిటినీ తీర్చి, స్థిరమైన, స్పష్టమైన నిర్ణయాన్ని చేసే భాగం అని కూడా అర్థాన్ని గ్రహించవచ్చు. అందువల్ల వేదాంతమనే విభాగంద్వారా వేదాలు తమ నిర్ణయాన్ని స్పష్టం చేసి చెప్పాయి { అర్థాన్ని ఇక్కడ మన గ్రహించవచ్చు. వేదాల తాత్పర్యం వేదాంత విభాగంలో స్పష్టమవుతున్నదని, అందువల్లనే అవి వేదాంతం అనే శబ్దంతో వ్యవహరింపబడుతున్నాయని భావించాలి. వేదాలను అన్నిటిని అధ్యయనం చేసినప్పటికీ వేద తాత్పర్యాన్ని స్పష్టంగా మనం గ్రహించలేము. అందువల్ల మనం వేదహృదయాన్ని, వేద నిర్ణయాన్ని తెలుసుకోవాలంటే, వేదాంత విభాగాన్ని అధ్యయనం చేయాలి. ఎందుకంటే, ఆ విభాగంలోనే కదా వేద నిర్ణయం స్పష్టం చేయబడినది. ఇటువంటి వేద తాత్పర్య నిర్ణయం ఉపనిషత్తులలో చేయబడినందున వీటికి వేదాంతాలు అనే పేరు వచ్చింది.

ఈ విధంగా పైన ప్రస్తావించిన శ్లోకం వాక, అనువాక, సామ, నిషత్, ఉపనిషత్ అనే ఈ ఐదు వేద విభాగాలు పరమాత్మను గూర్చి పలుకుతున్నాయని తెలుపుతున్నది. ఆ పరమాత్మ ఎటువంటివాడంటే, అతడు సత్యకర్మ. పరమసత్యస్వరూపుడు. పరమాత్మ ఏనాడు మార్పును పొందనివాడు. అతడు చేసే లీలలు అన్నీ సత్యమైనవి. అందువల్ల అతడు సత్యకర్మ. అతడు ఈ జగత్తును సృష్టిస్తున్నాడు, రక్షిస్తున్నాడు, లయాన్ని పొందిస్తున్నాడు. అతడు అనేక విధాలైన రామకృష్ణాది అవతారాలను ఎత్తి జగద్రక్షణ కార్యాన్ని నిర్వహిస్తున్నాడు. ఈ విధంగా భగవంతుడు చేసే కర్మలు అన్ని సత్యమైనవి అందువల్ల అతడు సత్యకర్మ అనబడుతున్నాడు. అందువల్ల, పైన ప్రస్తుతించిన శ్లోకం వేదంలోని మంత్రాలు, బ్రాహ్మణాలు, సామ అనే విభాగం, నిషత్తులు, ఉపనిషత్తులు – అన్నీ పరమాత్మ వైభవాన్ని పొగడుతున్నాయి–అని స్పష్టం చేస్తున్నది.

వేదతాత్పర్యాన్ని నిర్ణయాన్ని తెలియజేసే ఉపనిషద్ విభాగమే ప్రస్తుత విషయం. కారణం ఏదైతే ఏమి, మనం ఈ లోకంలో జన్మించాము. మనం ఈ జన్మ పరంపర నుండి విముక్తిని పొందడం కోసం ప్రయత్నిస్తున్నాము. ఈ లోకం అంతా దుఃఖమయమైనదని గుర్తిస్తున్నాము. ఈ లోకంలో ఏదో కొంచెం సుఖం ఉన్నట్లుగా కనిపించినప్పటికీ కూడా, అది క్షణికమే వెనువెంటనే మనకు విచారం కలుగుతుంది. అందువల్ల మనం నిరంతరమైన ఆనందాన్ని, మహానందాన్ని అనుభవించే చోటుకు చేరాలని కోరుకుంటున్నాము. ఎక్కడ బ్రహ్మానందం మాత్రమే ఉంటుందో, ఎక్కడ దుఃఖం అనేది లవలేశం కూడా ఉండదో, ఆ దేశాన్ని చేరాలని కోరుకుంటున్నాము. ఉపనిషత్తులు ఏమి చెబుతున్నాయి? అంటే, ఈ విధంగా ఉండే మోక్షానంద స్థానాన్ని చేరాలంటే ఈ సంసారం నుండి బయటపడాలని, ఈ సంసార బంధంనుండి విముక్తిని పొందాలని తెలియజేస్తున్నది. అంతేకాక ఆ ముక్తిని పొందడానికి తగిన మార్గాలను కూడా ఉపనిషత్తులు మనకు ఉపదేశిస్తున్నాయి.

అయినప్పటికీ, ఈ ఉపనిషత్తులను మన నేరుగా అధ్యయనం చేసి తెలుసుకోలేము. మన జ్ఞానం చాలా అత్యల్పమైనది. శక్తి అత్యల్పమైనది. ఆయుస్సు చాలా అల్పమైనది. అందువల్ల ఉపనిషత్తులను అన్నిటినీ సమగ్రంగా అధ్యయనం చేసే అవకాశం ఎంత మాత్రం లేదు. ఈ ఉపనిషత్తుల తాత్పర్యాన్ని, హృదయాన్ని విశదీకరించే కొన్ని గ్రంథాలు మనకు ఆవశ్యకం అయ్యాయి. మనం తెలుసుకోగలిగిన భాషలో ఉపనిషత్తుల అభిప్రాయాన్ని మనకు తెలియజేసే గ్రంథాలు అవసరం అయ్యాయి. ఈ విధంగా ఉపనిషత్తుల హృదయాన్ని మనకు స్పష్టంగా తెలియజేసే గ్రంథాలకే ఉపబృంహణాలు అని

పేరు. ఈ ఉపబృంహణాలను – వేదాల, ఉపనిషత్తుల తాత్పర్యాన్ని చక్కగా గ్రహించిన మహర్షులు మనకు ప్రసాదించారు. భవిష్యత్తులో వేదాల హృదయాన్ని, ఉపనిషత్తుల తాత్పర్యాన్ని స్పష్టంగా అందరూ గ్రహించేవిధంగా వారు ఉపబృంహణ గ్రంథాలను రచించారు. ఉప బృంహణాలను మాత్రమే అధ్యయనం చేస్తే చాలు, ఉపనిషత్తులను అధ్యయనం చేయవలసిన ఆవశ్యకత లేదు– అని చెప్పడంలో ఇక్కడ తాత్పర్యం లేదు. మొదట ఉపనిషత్తుల అధ్యయనాన్ని చేసినప్పటికీ, ఆ ఉపనిషత్తుల తాత్పర్య నిర్ణయాన్ని తెలుసుకోవడానికి ఉప బృంహణగ్రంథాల సహాయాన్ని మనం పొందాలి. అప్పుడే ఆ ఉపనిషత్తుల తాత్పర్యాన్ని సులభంగా, స్పష్టంగా గ్రహించడానికి వీలవుతుంది– అని తెలియజేయడంలోనే తాత్పర్యం.

వేదాల, ఉపనిషత్తుల తాత్పర్యాన్ని మనకు స్పష్టం చేసే ఉపబృంహణ గ్రంథాలు ఏవి? అంటే, అవి ఇతిహాసాలు, పురాణాలు. శ్రీరామాయణం, మహాభారతం అనేవి రెండు ఇతిహాసాలు. పురాణాలు సంఖ్యలో 18, ఇవికాక ఉప పురాణాలు 18 ఉన్నాయి. ఇవి అన్నీ వేదాంతాల తాత్పర్యాన్ని మనకు స్పష్టం చేస్తాయి.

ఈ విధంగా ఉండే ఉపబృంహణ గ్రంథాలలో మహాభారతం ప్రముఖమైనది. ఈ మహాభారతంలో ఉండే భగవద్గీత అత్యంత ప్రాధాన్యాన్ని కలిగినది. ఈ భగవద్గీతను సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానుడే అర్జునునకు ఉపదేశించాడు. ఈ విధంగా సాక్షాత్తు భగవంతుని ముఖం నుండే ఉద్భవించిన ఈ భగవద్గీత వేదాంతాల తాత్పర్యాన్ని తెలుసుకోవడంలో అత్యంతం ప్రమాణమైనది. అందువల్ల ఉపనిషత్తుల తాత్పర్యాన్ని స్పష్టం చేసే భగవద్గీత అందరిచే పరమ ప్రమాణంగా అంగీకరింపబడినది. అద్వైతం, విశిష్టాద్వైతం, ద్వైతం అని చెప్పబడే వేరు వేరు సంప్రదాయాలకు సంబంధించిన వేదాంతులందరూ కూడా పరమ ప్రమాణంగా ఈ భగవద్గీతను పరిగ్రహించారు. తమ తమ సిద్ధాంతాలకు అనుగుణంగా ఈ గ్రంథాన్ని అన్వయించుకుని అర్థం చెప్పుకున్నారు.

తరువాత బ్రహ్మసూత్రాలు బాధరాయణ మహర్షిచే రచింపబడినవి. ఈ బ్రహ్మసూత్ర గ్రంథం కూడా పరమ ప్రమాణంగా అందరిచే అంగీకరింపబడింది. ఇందువల్ల ఉపనిషత్తుల తాత్పర్యాన్ని తెలియజేసే ప్రామాణికమైన గ్రంథాలు రెండు. ఒకటి భగవద్గీత, వేరొకటి బ్రహ్మ సూత్రాలు. ఈ రెండు గ్రంథాలు ఉపనిషత్తుల హృదయాన్ని స్పష్టం చేస్తున్నాయి. ఏ విధంగానో కొంచెం గమనిద్దాం.

బ్రహ్మసూత్రాల విషయాన్నిగూర్చి ప్రస్తావన చేసినప్పుడు, భగవద్రామానుజల శ్రీ భాష్యంలో ఉండే ఈ శ్లోకంలోని

"పారాశర్యవచస్సుధామ్ ఉపనిషద్దుగ్ధాబ్ధిమధ్యోద్ధృతాం
సంసారాగ్ని విదీపనవ్యపగత ప్రాణాత్మసంజీవినీమ్."

అనే సూక్తిని ఇక్కడ మనం స్మరించుకోవాలి. పారాశర్యులు అంటే వేదవ్యాసులు. వీరు శ్రీ విష్ణు పురాణాన్ని అనుగ్రహించిన పరాశర మహర్షికి పుత్రులు. ఈ వేదవ్యాసులు బ్రహ్మసూత్ర గ్రంథాన్ని రచించారు. ఇది ఒక అమృతం వంటిది. ఈ అమృతం ఎక్కడనుండి ఉద్భవించింది అంటే, ఉపనిషత్తులు అనే పాలసముద్రం మధ్యలో నుండి పుట్టింది. దేవాసురులు పాల సముద్రాన్ని చిలికినప్పుడు ఒక అమృతం పుట్టింది. అది మరణం అనేది లేకుండా చేయగలిగినది. ఆ విధంగానే, ఉపనిషత్తులను అన్నిటిని ఒక క్షీరసముద్రంగా భావించినప్పుడు, ఆ క్షీరసముద్రాన్ని మథించగా బ్రహ్మ సూత్రాలు అనే అమృతం పుట్టింది అని ఈ సూక్తిలో శ్రీరామానుజులు అంటున్నారు. అంటే, ఈ బ్రహ్మసూత్రాలు ఉపనిషత్తుల సారం అని తాత్పర్యం.

ఇదే విధంగా భగవద్గీత కూడా ఉపనిషత్తుల సారమే. అది కూడా ఒక అమృతమే. ఇక్కడ ఈ శ్లోకాన్ని గమనించండి.

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సః సుధీః భోక్తా దుగ్ధం గీతామృతం మహత్"

ఇది చాలా ప్రసిద్ధమైన శ్లోకం. శ్రీకృష్ణుడు ఏమి చేశాడంటే, ఉపనిషత్తులను అన్నిటిని గోవులనుగా మార్చాడు. తాను గోపాలుడయ్యాడు, గోపాలునకు తెలిసిన పని గోవుల దగ్గర నుండి పాలను పితకడమే కదా. అందువల్ల అతడు ఏమి చేశాడంటే, గోవులనుగా ఉపనిషత్తులను మార్చి, ఆ గోవుల దగ్గర నుండి పాలను పితికే గొల్లవాడుగా మారి, అర్జునుని లేగ దూడగా మార్చాడు. గోవుల దగ్గర నుండి పాలను పితకాలంటే, లేగ దూడ ఉండాలి కదా. ఉపనిషత్తులు అనే గోవుల నుండి శ్రీకృష్ణుడు అరే గొల్లవాడు అర్జునుడు అనే లేగ దూడను పురస్కరించుకుని పితికిన పాలు ఏమంటే, అమృతం వంటి భగవద్గీతయే. గోవు దగ్గర ముందుగా పాలు తాగేది లేగదూడయే కదా. ఆ విధంగానే ఉపనిషత్తులు అనే గోవుల దగ్గర నుండి పుట్టిన భగవద్గీత అనే అమృతాన్ని ముందుగా తాగిన లేగ దూడ అర్జునుడు అయ్యాడు. ఆవు పొదుగు నుండి స్రవించే పాలు లేగ దూడతో పాటుగా, ఆ పాలను తాగాలని కోరిన అందరికీ అందుతుంది. ఆ విధంగానే, ఈ గొప్పదైన

గీతామృతం కూడా అర్జునునకే కాక, జగత్తులోని పండితులకు, స్వచ్ఛమైన జ్ఞానం కలిగిన, హృదయాన్ని కలిగిన అందరికి అందింది. ఇందువల్ల భగవద్గీత కూడా ఉపనిషత్తుల సారమే అని తెలుస్తున్నది.

ఇందువల్ల, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత అనే ఈ రెండు ఉపబృంహణ గ్రంథాలు కూడా ఉపనిషత్తులు నుండే ఆవిర్భవించాయి, అందుచేత అవి ఉపనిషత్తులలో లేని అర్థాలను వేనిని చెప్పవు. అవి ఉపనిషత్తుల తాత్పర్యాన్ని విశదీకరిస్తాయి. అందులో లేని ఏ విషయాన్ని నూతనంగా చెప్పవు.

అందువల్ల, ఇప్పుడు మనకు వేద తాత్పర్యాన్ని తెలుసుకోవడానికి మూడు గ్రంథాలు ఉన్నట్లుగా తెలుస్తున్నది. వాటిలో మొదటిది ఉపనిషత్తులు. ఇవి ప్రధానమైనవి. రెండవది వేదవ్యాసునిచే రచింపబడిన బ్రహ్మసూత్ర గ్రంథం. మూడవది శ్రీకృష్ణ భగవానునిచే ఉపదేశింపబడిన భగవద్గీత. ఈ మూడు గ్రంథాలకు ప్రస్థాన త్రయం అని పేరు. సూత్ర ప్రస్థానం, ఉపనిషత్ ప్రస్థానం, గీతా ప్రస్థానం అని పేరు. ప్రస్థానం అంటే, నదిలో ప్రవేశించే రేవుకు పేరు. ఆ విధంగానే పరబ్రహ్మం అనే నదిలో సులభంగా ప్రవేశించడానికి తగిన రేవుల వంటివి, ఈ మూడు గ్రంథాలు. ఉపనిషత్ ప్రస్థానం ద్వారా బ్రహ్మ అనే నదిలో ప్రవేశించి దాని వైభవాన్ని తెలుసుకోవచ్చు, సూత్ర ప్రస్థానం అనే రేవు ద్వారా ప్రవేశించి బ్రహ్మ వైభవాన్ని తెలుసుకోవచ్చు, గీతా ప్రస్థానం ద్వారా ప్రవేశించి పరమాత్మ వైభవాన్ని గ్రహించవచ్చు. అందువల్లనే అద్వైత, ద్వైత, విశిష్టాద్వైత వాదులు అందరూ కూడా ఈ మూడు ప్రస్థానాల ద్వారా తమ తమ సిద్ధాంత తత్వాన్ని దర్శించడానికి వివరించడానికి ప్రయత్నం చేశారు. ఈ మూడింటికి వారి వారి సిద్ధాంతాలకు అనుగుణంగా వ్యాఖ్యానాలను రచించారు.

భగవద్రామానుజులు రచించిన శ్రీభాష్య గ్రంథం బ్రహ్మసూత్రాల వివరణ రూపమే. విధంగానే, భగవద్గీతపై వారు గీతాభాష్యం అనే వివరణ గ్రంథాన్ని విశిష్టాద్వైత సిద్ధాంతానుగుణంగా తత్వాలను ఆవిష్కరించడంకోసం అనుగ్రహించారు. ఉపనిషత్తులకు వారు ప్రత్యేకించి ఏ వ్యాఖ్యానాన్ని రచించకపోయినప్పటికీ, ఆవశ్యకమైన వేదవాక్యాలకు అన్నిటికీ వివరణ రూపంగా వేదార్థ సంగ్రహం అనే గ్రంథాన్ని అనుగ్రహించారు. వేదవాక్యాలలో ఎక్కడెక్కడ తమ సిద్ధాంతానికి అనుగుణంగా వివరించవలసి ఉన్నదో, ఆయా భాగాలను ప్రస్తావించి, ఇతర సిద్ధాంతాలలో ఉండే లోపాలను ఎత్తిచూపుతూ, ఆ వాక్యాలకు తమ సిద్ధాంతానికి అనుగుణంగా వ్యాఖ్యానాన్ని ఆ గ్రంథంలో అనుగ్రహించారు.

ఈ విధంగా వారు ఉపనిషత్తులలో ముఖ్యమైన భాగాలకు కూడా వ్యాఖ్యానం రచించినట్లే అయినది. అందువల్ల, ఉపనిషత్ ప్రస్థానం, బ్రహ్మసూత్ర ప్రస్థానం, గీతా ప్రస్థానం అనే ఈ మూడు వేద తాత్పర్యాన్ని తెలుసుకోవడానికి, నిర్ణయం తెలుసుకోవడానికి ముఖ్యమైన ఆధార గ్రంథాలుగా పరిగణింపబడుతున్నాయి. ఇప్పుడు ఈ గ్రంథాలలో సమతావాదం ఏ విధంగా ప్రస్తావన చేయబడిందో స్థాలీపులాకంగా గమనిద్దాం.

మనం, ఈ లోకాన్ని సాధారణంగా గమనించినప్పుడు, భేదం అనేది స్పష్టంగా గోచరిస్తుంది. అప్పుడే పుట్టిన బిడ్డను గమనిస్తే, అతని బరువును బట్టి, ఎత్తును బట్టి, రంగును బట్టి, ఇంకా అనేక విధాలయిన కారణాలను బట్టి ఇతరుల కంటే అతనికి కల భేదం స్పష్టంగా కనిపిస్తుంది. ఆ విధంగానే, ఆ బిడ్డ పెరిగిన తరువాత కూడా, అతడు చేసే పనులను బట్టి, అతని అలవాట్లను బట్టి, ఇంకా అతనికి సంబంధించిన అనేక విషయాలను బట్టి అతడు మిగిలినవారి కంటే భిన్నుడిగా కనిపిస్తాడు. ఈ భేదం అనేది కేవలం వ్యక్తుల మధ్యనే కాదు, సంస్థల మధ్య కూడా కనిపిస్తుంది. ఒక సంస్థ చేసే పని, దానివల్ల కలిగే ప్రయోజనం మిగిలిన సంస్థల పని, ప్రయోజనాల కంటే వేరువేరుగా ఉంటాయి. ఈ విధంగా ఈ లోకంలో దేనిని చూసినప్పటికీ, అది మిగిలిన దానికంటే వేరుగా గోచరిస్తుంది. ఒక వ్యక్తికి, వస్తువుకు మిగిలిన వ్యక్తుల కంటే, వస్తువుల కంటే ఉండే భిన్నత్వం స్పష్టమవుతుంది.

కానీ, ఉపనిషత్తుల దృష్టి ఈ విధంగా ఉండదు. అని భిన్న కోణంలో దర్శించి మనకు వీటిలో ఉండే సామ్యాన్ని, సమతను ఉపదేశిస్తాయి. ఉపనిషత్తులు లోకంలో ఉండే అందరూ వ్యక్తులు సమానమే అని చెబుతున్నవి. అవి, వ్యక్తుల మధ్య వస్తువుల మధ్య కనిపించే భిన్న భిన్న ధర్మాలను దృష్టిలో పెట్టుకోవు. వాటి మధ్య కనిపించే సామ్యాలను మాత్రమే గమనించి తెలుపుతున్నవి. ఈలోకంలో ఉండే వ్యక్తుల మధ్య మాత్రమే కాకుండా, చరాచర వస్తువుల మధ్య ఉండే సామ్యాలను దృష్టిలో పెట్టుకొని సమతను ఉపదేశిస్తున్నవి.

ఉపనిషత్తులు ఏ విధంగా ఈ సమతను ఉపదేశిస్తాయి? అనే విషయం ఇపుడు మనం గమనించవలసిన అంశం. ఉపనిషత్తులు ఈ లోకంలో ఉండే వస్తువులు అన్నీ సమానమని చెబుతున్నవి. ఈ సంసారంలో ఉండే మనం అందరం బద్ధజీవాత్మలమని చెప్పబడుతున్నాము. కొంతకాలం తరువాత ఈ సంసార బంధం నుండి విముక్తిని పొందిన జీవులు కూడా జీవాత్మలనే పేరుతోనే చెప్పబడుతున్నారు. అయితే, వారు ముక్త జీవాత్మలని చెప్పబడుతున్నారు. సంసారబంధం ఏనాడు లేకుండా, ఎల్లప్పుడూ పరమపదంలోనే ఉంటూ, పరమాత్మ సేవచేసి ఆనందించే జీవులు కొందరు ఉన్నారు. వారు నిత్యాత్మలని

చెప్పబడుతున్నారు. పరమాత్మ శ్రీమన్నారాయణుడు. అతడు అందరికీ స్వామి ఈ జీవాత్మల కంటే భిన్నుడు.

ఉపనిషత్తులు ఏమని ఉపదేశిస్తున్నాయి? అని అంటే, జీవాత్మలన్నీ సామ్యాన్ని కలిగి ఉన్నాయని అని తెలుపుతున్నాయి. ఆ విధంగానే, భగవంతునితో కూడా కొన్ని అంశాలలో సామ్యాన్ని జీవాత్మలు కలిగి ఉన్నాయని కూడా చెబుతున్నవి. ఉపనిషత్తులు జీవాత్మల మధ్య ఉండే సామ్యాన్ని మాత్రమే కాకుండా, జీవాత్మలకు, పరమాత్మకు మధ్య ఉండే సామ్యాన్ని గూర్చి కూడా ప్రస్తుతించాయి.

ఉపనిషత్తులు ఆత్మలన్నీ సమానమని చెబుతున్నాయి అని అంటే, ఏ దృష్టిలో చెబుతున్నాయి? అనే విషయాన్ని మనం ముందు అర్థం చేసుకోవాలి. ఇందుకోసం మొదట జీవాత్మ లక్షణం ఏమో దానిని గ్రహించాలి. " నేను ఉన్నాను, నేను తెలుసుకున్నాను" అని ఈ విధంగా నేను అనే పదాన్ని ప్రయోగించినప్పుడు, ఈ "నేను" అనే పదం కేవలం బయట కనిపించే శరీరాన్ని మాత్రమే కాకుండా, అంతకంటే వేరైన, ఆశరీరంలో ఉండే ఆత్మను నిర్దేశిస్తున్నది అని తెలియాలి. లోకంలో "ఇది నా శరీరం, ఇది నా చేయి ఇది నా కాలు" అనే ప్రయోగం ఉన్నది తప్ప, "నేను శరీరం, నేను చేయి, నేను కాలు" అనే ప్రయోగాలు లేవుకదా. దీనిని బట్టి "నేను" అనేది, శరీరం అనేది రెండు వేరు వేరు వస్తువులు అనే విషయం స్పష్టం అవుతుంది. ఈ విధంగా నేను అనే పదం చేత నిర్దేశింపబడేది ఆత్మ.

ఈ ఆత్మ వస్తువు జీవాత్మ అని, పరమాత్మ అని రెండు విధాలయినది. ఆత్మలన్నీ ఒక సమానమైన ధర్మం ద్వారా తెలియబడుతున్నాయి. బృహదారణ్యకోపనిషత్తు "యథా సైంధవఘనో ఽ నంతరో ఽ బాహ్యః కృత్స్నో రసఘన ఏవ, ఏవం వా అరే అయమాత్మానంతరో ఽ బాహ్యః కృత్స్నో విజ్ఞానఘన ఏవ" అని అంటున్నది. దీని తాత్పర్యం ఏమంటే, సైంధవలవణం అని చెప్పబడే రాతి ఉప్పు గడ్డను తీసుకొన్నట్లయితే, దానిని లోపల చూసినా, బయట చూసినా, అంతటా కూడా అది ఉప్పగానే ఉంటుంది. ఆ విధంగానే, ఆత్మను గమనించినట్లయితే, అది విజ్ఞానమయంగా ఉంటుంది. లోపల బయట విజ్ఞానమయంగానే ఉంటుంది. అందువల్ల రాతి ఉప్పు గడ్డ ఏ విధంగా ఉప్పగా ఉండడం అనేది దాని స్వరూపమై ఉంటుందో, ఆత్మ అనేది జ్ఞానాన్ని స్వరూపంగా ఉంటుంది.

ఆత్మ జ్ఞానస్వరూపంగా ఉండడమే కాక, జ్ఞానాన్ని గుణంగా కూడా కలిగి ఉంటుంది. "నేను" అని అన్నప్పుడు, "నేను" అనే పదం జ్ఞానస్వరూపమైన ఆత్మను తెలుపుతుంది. "నేను ఈ విషయాన్ని తెలుసుకుంటున్నాను, ఈ విషయాన్ని చూస్తున్నాను"

అని అన్నప్పుడు, "నేను ఒక వస్తువుకు సంబంధించిన జ్ఞానాన్ని పొందుతున్నాను, ఒక వస్తువుకు సంబంధించిన జ్ఞానాన్ని కలిగి ఉన్నాను" అని అర్థం. అందువల్ల ఇక్కడ, జ్ఞాన స్వరూపమైన ఆత్మ ఒకటి ఉన్నది, ఆ జ్ఞాన స్వరూపమైన ఆత్మకు జ్ఞానమనే గుణం కూడా ఉన్నది– అని తెలుస్తున్నది. గుణంగా చెప్పబడే జ్ఞానానికి ధర్మభూతజ్ఞానమని, ఆత్మ స్వరూపంగా చెప్పబడే జ్ఞానానికి ధర్మిభూత జ్ఞానమని పేరు.

ఇక్కడ, దీపాన్ని ఒక ఉదాహరణగా గ్రహించవచ్చు. దీపకళిక అనేది ప్రకాశ రూపమైనది, అదిప్రకాశాన్ని స్వరూపంగా కలిగి ఉంటుంది. ఈ ప్రకాశమే ధర్మిభూతజ్ఞానంవంటిది. ప్రకాశాన్ని స్వరూపంగా కలిగిన దీపంనుండి అంతటా వెలుతురు వ్యాపిస్తుంది. ఈ విధంగా అంతటా వ్యాపించే ప్రభ ధర్మభూత జ్ఞానం వంటిది. అంతటా వ్యాపించే ఈ ప్రభ కూడా దీపం వలె ద్రవ్యమే. ఏ విధంగా దీపకళిక వేరు, ఆ దీపకళికకు ఉండే ప్రకాశం అనే గుణం వేరుగా ఉన్నాయో, ఆ విధంగానే, ఆత్మకు స్వరూపంగా చెప్పబడే జ్ఞానం వేరు, ఆత్మకు గుణంగా చెప్పబడే జ్ఞానం అనేది వేరు అని తెలియాలి. అంతేకాదు, దీపకళిక లేకుండా ప్రభ అనేది ఉండదు కదా. దీపం లేనప్పుడు అంతకు ముందు దీపం చుట్టూ వ్యాపించిన వెలుతురు కూడా లేకుండా పోతున్నది. అందుచేత దీపం వేరు, దాని వెలుతురు వేరు. ఈ రెండు వేరు వేరు ద్రవ్యాలు అని గుర్తిస్తున్నాం. ఆ విధంగానే, ఆత్మ స్వరూపమైన జ్ఞానం వేరు, ఆ ఆత్మకు గుణంగా చెప్పబడే జ్ఞానం వేరు అని గ్రహించాలి.

అందుచేత, " నేను ఈ వస్తువును చూస్తున్నాను" అని అన్నప్పుడు, రెండు విధాలైన జ్ఞానాలు ఉన్నాయని తెలియాలి. "నేను" అనే పదం చేత చెప్పబడేది ధర్మిభూత జ్ఞానం ఒకటి వస్తువుకు సంబంధించిన జ్ఞానం వేరొకటి. "ఈ వస్తువును చూస్తున్నాను" అని అన్నప్పుడు "నేను" అని అనబడే ఈ ఆత్మకు గుణంగా ఉండే ధర్మభూతజ్ఞానం ద్వారా ఈ వస్తువును గ్రహిస్తున్నాను– అని అర్థం. అందువల్ల ఆత్మ అనేది పరిపూర్ణంగా జ్ఞాన స్వరూపమని ఏర్పడుతున్నది.

ఆత్మ జ్ఞానైకాకారం. అంతే తప్ప, అది మాంసమయమైనదో, పంచభూతాలతో నిర్మింపబడినదో కాదు. ఈ విధంగా జ్ఞానైకాకారంగా ఉండడం అనేది ఆత్మలన్నిటికి సమానమే. ఈ విషయమే పైన ఉదాహరించిన "ఏవం వా అరే అయ మాత్మా నంతరో ఽ బాహ్యః కృత్స్నో విజ్ఞానఘన ఏవ" అనే బృహదారణ్యకోపనిషత్ వాక్యం ద్వారా తెలుస్తున్నది. ఈ విధంగా జ్ఞాన స్వరూపంగా ఉండడం, జ్ఞానాన్ని గుణంగా కలిగి ఉండడం అనేది ఆత్మలన్నిటికీ సమానమైన ధర్మం.

ఆత్మ అనేది జ్ఞాన స్వరూపమని, జ్ఞాన గుణకం అని చెప్పినప్పుడే, అది ఈ శరీరం కంటే వేరైనది అని తెలుస్తున్నది. బయట కనిపించే శరీరం పంచేంద్రియాత్మకమైనది. ఆ విధంగానే జ్ఞాన స్వరూపం కాని మనస్సు కంటే ఆత్మ వేరు అని తెలుస్తుంది. వాయు స్వరూపమైన ప్రాణం కంటే ఆత్మ వేరు అని తెలుస్తుంది. ఈ విధంగా ఆత్మ అనేది శరీరం కంటే, మనసు కంటే, ప్రాణం కంటే భిన్నం అని తెలుస్తున్నది. భగవద్యామునులు సిద్ధిత్రయంలోని ఆత్మసిద్ధిలో "దేహేంద్రియమనఃప్రాణధీభ్యో ఽ న్యోనన్య సాధనః" అని అంటూ ఆత్మ వస్తువు దేహం కంటే, ఇంద్రియాల కంటే, మనసు కంటే, ప్రాణం కంటే, బుద్ధి కంటే భిన్నమైనదని అన్నారు.

ఈ విధంగా ఈ లోకంలో ఉండే ఆత్మలన్నిటిని జ్ఞానైకాకారంగా, జ్ఞానగుణకంగా చూసినప్పుడు, వేరు వేరు ఆత్మల మధ్య బాహ్యంగా కనిపించే తేడాలు ఏవీ మనకు గోచరించవు. బాహ్యంగా ఉండే శరీరంతో కూడి ఉన్నప్పుడే, ఈ ఆత్మల మధ్య తారతమ్యాన్ని గుర్తించవచ్చు. శ్వేతాశ్వతరోపనిషత్తు "నైవ స్త్రీ న పుమానేష న చైవాయం నపుంసకః, యద్యత్ శరీర మాదత్తే తేన తేన స యుజ్యతే" అని అంటున్నది. ఆత్మ పురుషుడు కాదు, స్త్రీ కాదు, నపుంసకుడు కాడు. ఆత్మ శరీరాన్ని పరిగ్రహించినప్పుడు మాత్రమే ఈ ధర్మాలను, తేడాలను అన్నిటినీ కలిగి ఉంటుంది. ఆత్మకు వర్ణం లేదు, కానీ అది శరీరంతో కూడి ఉండేటప్పుడు ఆ ధర్మాన్ని కలిగి ఉంటుంది. ఏనుగు నల్లగా ఉన్నదని అంటే, ఆ నల్లదనం ఏనుగు శరీరంలో ఉండే ఆత్మకు సంబంధించిన ధర్మం కాదు. ఆ ఏనుగు శరీరానికి మాత్రమే సంబంధించినది. ఆ విధంగానే, పురుషుడై ఉండడం, స్త్రీగా ఉండడం, నపుంసకుడుగా ఉండడం అనే ధర్మాలు కూడా ఆత్మకు చెందినవి కాదు, శరీరానికి మాత్రమే చెందినవి. పురుషుడని, స్త్రీ అని, నపుంసకుడని చెప్పబడే వ్యవహారాలు అన్ని ఆత్మలకు అవి శరీరంతో కూడి ఉన్నప్పుడు ఏర్పడతాయి, పొసగుతాయి. అందువల్ల ఆత్మలు స్వతః సిద్ధంగా పురుషత్వ స్త్రీత్వ నపుంసకత్వాది ధర్మాలతో భిన్నాలు కావు. ఆ విధంగానే, ఎత్తుగా ఉండడం, పొట్టిగా ఉండడం, లావుగా ఉండడం, సన్నంగా ఉండడం, ఆరోగ్యంగా ఉండడం, అనారోగ్యంగా ఉండడం అని మొదలైన, శరీరానికి సంబంధించిన ధర్మాలు ఏవీ ఆత్మకు సంబంధించినవి కావు. ఆత్మ అనేది జ్ఞాన స్వరూపమైనది, జ్ఞానాన్ని గుణంగా కలిగినది.

ఈ దృష్టిలో ఆత్మలను చూసినప్పుడు, వాటి మధ్య ఏ విధమైన తేడాలను మనం గమనించలేము. అతడు శత్రువు కావచ్చు, స్నేహితుడు కావచ్చు, వారిలో ఉండే ఆత్మలు

అన్నీ జ్ఞానాన్ని ఆకారంగా కలిగినవి, జ్ఞానాన్ని గుణంగా కలిగినవి అని గుర్తించినప్పుడు, వారి మధ్య భేదం మనకు గోచరించదు. ఈ విషయమే శ్రీవిష్ణు పురాణంలో "యద్యన్యో ఽ స్తి పరః కో ఽ పి మత్తః పార్థివసత్తమ! , తదా ఏషో హ్యయం చాన్య ఇతీష్యతే" అని అంటూ తెలిపింది. "ఒక ఆత్మ జ్ఞాన స్వరూపిగాను, వేరొక ఆత్మ ఆ విధంగా జ్ఞాన స్వరూపి కాకుండా ఉన్నట్లయితే, వేరొక భిన్నమైన స్వరూపాన్ని కలిగి ఉన్నట్లయితే, అప్పుడు ఆ రెండు ఆత్మల మధ్య భేదాన్ని దర్శించవచ్చు. అతడు వేరు, నేను వేరు అని భావించవచ్చు. కానీ, ఆత్మలన్నీ జ్ఞానాన్ని స్వరూపంగా కలిగినవి కనుక, నేను ఈ ఆత్మల మధ్య భేదాన్ని దర్శించలేకుండా ఉన్నాను" అని ఈ శ్లోకంలోని తాత్పర్యం. అందువల్ల ఆత్మలన్నీ జ్ఞానాన్ని స్వరూపంగా కలిగి ఉన్న సామ్యాన్ని మనం గ్రహించాలి. ఇది ఉపనిషత్తులు మనకు ఉపదేశించిన, ఆత్మలన్నిటి మధ్య ఉండే మొట్టమొదటి సమత.

భగవద్గీతలో కూడా శ్రీకృష్ణ పరమాత్మ ఈ విషయాన్ని "విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని, శుని చైవస్వపాకే చ పండితాః సమదర్శినః" అని అంటూ అయిదవ అధ్యాయంలో ఆత్మల సమతను ప్రస్తావన చేశాడు. విద్యను వినయాన్ని పరిపూర్ణంగా కలిగినవానిలో, బ్రాహ్మణునిలో, గోవులో, ఏనుగులో, శునకంలో, ఆ కుక్క మాంసం తినేవానిలో ఉండే ఆత్మలను జ్ఞానులు జ్ఞానైకాకారాన్ని కలిగినవిగా దర్శిస్తారు– అని అన్నాడు. పండా అంటే జ్ఞానం. దానిని కలిగిన వాడు పండితుడు. జీవాత్మ స్వరూపాన్ని పరిపూర్ణంగా అర్థం చేసుకున్నవాడు. అటువంటి పండితుడు ఈ లోకంలో ఉండే ఆత్మలన్నిటిని జ్ఞానైకాకారంగా దర్శిస్తాడు. అందరిలో ఉండే ఆత్మలు సమానంగా, అంటే, జ్ఞాన స్వరూపంగా దర్శిస్తాడు. వాటి వాటి శరీరాలను బట్టి ఏర్పడే భేదాలను గమనించడు. అన్నిటిలో ఉండే ఆత్మలను జ్ఞాన స్వరూపంగా తెలుసుకుంటాడు. ఆత్మలు అవి గతంలో చేసిన కర్మలను బట్టి, ఆ కర్మలలో ఉండే తారతమ్యాన్ని బట్టి వేరు వేరు శరీరాలను పరిగ్రహించాయి తప్ప, అవి అన్ని జ్ఞానాన్ని స్వరూపంగా కలిగినవే, జ్ఞానాన్ని గుణంగా కలిగినవే అని గ్రహిస్తాడు. అందువల్ల బయట కనిపించే ఆకారాలు అన్నీ ఒక కారణం వల్ల, ఒక ఉపాధి వల్ల, అంటే, పుణ్య పాప రూపమైన కర్మల వల్ల ఏర్పడినవే తప్ప, సహజం కాదు, ఆ కర్మలు తొలగిపోయినప్పుడు వాటి వల్ల ఏర్పడే ఈ దేహాలు కూడా తొలగిపోతాయి, అప్పుడు ఆత్మలన్నీ జ్ఞానైకాకారంగా ప్రకాశిస్తాయి. అందువల్ల ఆత్మలన్నీ సమతను కలిగినవి, జ్ఞానాన్ని ఆకారంగా గుణంగా కలిగినవి, బయట కనిపించే, శరీరంలో కనిపించే ధర్మాలు ఏవి ఆత్మకు చెందినవి కాదు –అని వారు గ్రహిస్తారు. ఈ విధంగా దర్శించినప్పుడు, సమదృష్టి కలిగినప్పుడు, ఒకడు శత్రువు అని గాని వేరొకడు మిత్రుడు అని కానీ తోచదు. అందరూ

సమానమనే భావం ఏర్పడుతుంది. ఆత్మజ్ఞానసాక్షాత్కారం కలిగినప్పుడు జీవులందరిలోనూ జ్ఞానైకారత్వాన్ని దర్శించగలుగుతారు ఈ విధంగా దర్శించగలిగినప్పుడే ఆత్మజ్ఞాన సిద్ధి కలిగినట్లు అవుతుంది. విద్యా వినయయాలను పూర్తిగా కలిగినవాడు, సామాన్యమైన బ్రాహ్మణుడు, గోవు, ఏనుగు, కుక్క ఆ కుక్క మాంసాన్ని తినేవాడు– అని ఈ విధంగా బయటకు వేరువేరుగా కనిపించే ప్రాణులలో అందరిలోనూ సమదృష్టిని కలిగి ఉంటారు. ఎందుకంటే, వీరందరిలోనూ ఉండే ఆత్మ జ్ఞానస్వరూపాన్ని కలిగినది, జ్ఞానాన్ని గుణంగా కలిగినది అని తెలుసుకున్నవారు కనుక.

ఈ సందర్భంగా గీతాచార్యుడు పలుకుతూ, "ఇహైవ తైః జితః సర్గః యేషాం సామ్యే స్థితం మనః, నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాత్ బ్రహ్మణి తే స్థితాః" – అందరినీ సమానంగా చూడగలిగినవాడు ఇక్కడే ముక్తిని పొందినవాడు అవుతాడు. ఇక్కడే సంసారాన్ని జయించినవాడు అవుతాడు, ఎందుకంటే, వారు ఆత్మలన్నిటిలోనూ సమదృష్టిని కలిగినవారడు కనుక. ఆత్మలన్నీ జ్ఞాన స్వరూపంగా జ్ఞానగుణకంగా తెలుసుకున్నవాడు కనుక. కర్మల రూపంలోని, సంసారం రూపంలోని ఉపాధి తొలగిన ఆత్మ బ్రహ్మ అని చెప్పబడుతున్నది. అటువంటి ఆత్మ ఏ దోషం లేనిది, నిర్దోషమైనది. అటువంటి సంసార సంబంధం లేని ఆత్మలన్నీ సమానమైనవి. ఈ సంసారంలో జీవులు వేరువేరుగా గోచరించడానికి కారణం– కర్మల రూపంలో అని ఉపాధి వల్ల ఏర్పడిన శరీరం మొదలైనవి. ఈ శరీరం మొదలైనవి. ఇవి ఆత్మకు సహజమైనవి కాదు. సోపాధికాలు. ఈ విషయాన్ని గుర్తించినవానికి ఎవని విషయంలోను అనుకూల భావం కానీ ప్రతికూల భావం కానీ ఉండదు. అందువల్ల అతడు ఈ సంసారంలోనే ముక్తిని పొందినవాడు అవుతున్నాడు– అని అన్నాడు, శ్రీకృష్ణుడు. ఈ విధంగా ఆత్మలన్నీ జ్ఞానైకాకారంగా ఉండడం అనే సమతను కలిగి ఉన్నాయి– అని ఉపనిషత్తులు మనకు బోధిస్తున్నాయి దీనినే గీత కూడా తెలుపుతున్నది. శ్రీవిష్ణుపురాణం వివరించింది. ఉపనిషత్తులు బోధించిన సమతాదర్శనంలో ఇది ఒక అంశం.



# 18. ఉపనిషత్తులలోని సమతాదర్శనమ్ – 2

ఇప్పుడు, ఉపనిషత్తులలో సమతాదర్శనం అనే శీర్షికలోని రెండవది, చాలా ముఖ్యమైనది అయిన అంశాన్ని గమనిద్దాం. ఈ రెండవ అంశం ఏమంటే, ఈ జగత్తులోని చేతనాచేతనాలు అన్నీ పరమాత్మను ఆత్మగా కలిగి ఉండడం అనేది. ఉపనిషత్తులు ఏమని అంటున్నాయి? అంటే " తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్, తదనుప్రవిశ్య సచ్చ త్యచ్చావత్". అని పరమాత్మ ఈ జగత్తును సృష్టించినప్పుడు అతడు ఈ జగత్తులో అంతర్యామిగా అనుప్రవేశిస్తున్నాడు. "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" అని అంటూ వేదం పరమాత్మ జీవులందరిలో అంతర్యామిగా అనుప్రవేశించే విషయాన్ని తెలుపుతున్నవి. ఇందువల్ల పరమాత్మ జీవులందరిలోనూ ఆత్మగా నిలచి ఉన్నాడు.

ఉదాహరణకు, నా శరీరాన్నే గమనించాము అనుకోండి. నా ఈ శరీరంలో "నేను" అనే ఆత్మ ఉన్నది. బయట కనిపించే నా రూపం " నేను" అనే నా ఆత్మకు శరీరం. ఆ విధంగానే, నా ఆత్మలోపల పరమాత్మ నిలిచి ఉన్నాడు, అంటే, ఆ పరమాత్మకు శరీరంతో కూడి ఉన్న నా ఆత్మ శరీరమై ఉన్నది. పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుడు నాలో అంతర్యామియై ఉన్నట్లే, ఆత్మలందరిలో అంతరాత్మగా నిలచి ఉన్నాడు. అందువల్ల ఆత్మలన్నిటినీ అతడు తనకు శరీరంగా కలిగి ఉన్నాడు. నేను నా శరీరం లోపల ఉన్నట్లుగానే, పరమాత్మ "నేను" అనే ఈ జీవాత్మ లోపల అంతరాత్మగా ఉన్నాడు. బయట కనిపించే నా రూపం ఏ విధంగా "నేను "అనే నా ఆత్మకు శరీరం అవుతున్నదో, ఆ విధంగానే బయట కనిపించే నా శరీరం, దాని లోపల ఉండే "నేను" అనే ఈ నా ఆత్మ, ఈ రెండు, నా ఆత్మలోపల ఉండే పరమాత్మకు శరీరమై ఉన్నాయి. ఈ విధంగా ఈ బ్రహ్మాత్మకత్వం అనేది, అంటే, బ్రహ్మను ఆత్మగా కలిగి ఉండడం అనేది జీవులందరికీ సమానం.

ఉపనిషత్తులలో ప్రసిద్ధంగా "నేహ నానాస్తి కించన" అనే ఒక వాక్యం ఉన్నది. అంటే, ఈ లోకంలో అనేకమైన వస్తువులు లేవు– అని దీని అర్థం. ఈ వాక్యాన్ని గమనించినప్పుడు మనకు మనసులో ఒక సందేహం కలుగుతుంది. ఈ లోకంలో ఎంతోమంది జీవాత్మలు ఉన్నారు. ఎన్నో అచేతన పదార్థాలు ఉన్నాయి. ఈ విధంగా అనేకమైన ఆత్మలు, అనేకమైన అచేతన పదార్థాలు ఉండగా, ఈ లోకంలో అనేకం లేవు, ఒకటే ఉన్నది– అని ఈ ఉపనిషత్తు పలకడంలో ఉండే తాత్పర్యం ఏమి? ఇది ఏ విధంగా సాధ్యం? అనే సందేహం తప్పక కలుగుతుంది.

ఈ ఉపనిషద్వాక్యం చెప్పినది వాస్తవమే. ఉపనిషత్తు అసత్యాన్ని పలుకదు కదా. ఏ విధంగా ఇది సత్యం? అనే విషయాన్ని కొంచెం జాగ్రత్తగా గమనించాలి. ఈ వాక్యం, "ఈ లోకంలో బొత్తిగా బ్రహ్మ కంటే వేరే పదార్థాలు ఏమీ లేవు " అని చెప్పడం లేదు. మరి ఏమని తెలుపుతున్నది? అని అంటే, ఈ జగత్తులో ఉండే చేతనాచేతన పదార్థాలు అన్నీ కూడా పరమాత్మను ఆత్మగా కలిగినవి, ఆ విధంగా పరమాత్మను ఆత్మగా కలిగి ఉండకుండా ఉండే వేరొక వస్తువు ఏదీ లేదు –అని తెలుపుతున్నది. ఇది సత్యమే కదా. అందరికీ పరమాత్మ ఆత్మ అయినప్పుడు, అన్నిటిలోనూ బ్రహ్మాత్మకత్వం అనే ధర్మం ఉన్నప్పుడు, ఈ ఉపనిషత్ వాక్యం పలికిన అర్థం సత్యమే కదా. పరమాత్మ ఈ జగత్తులోని అన్నిటిలోనూ ఆత్మగా నిలచి ఉన్నాడు–అనే ఈ విధంగా ఉండే ఒక సామ్యం ఈ జగస్తులో అన్నిటిలో ఉన్నది. ఇటువంటి సామ్యం లేని వేరొక వస్తువు ఏదీ ఈ జగత్తులో లేదు –అని ఇక్కడ గ్రహించాలి. అందువల్ల"బొత్తిగా, పూర్తిగా, వేరొక వస్తువు ఏదీ లేదు" అని ఇక్కడ అర్థం కాదు. రెండవ విధమైన, అంటే, బ్రహ్మాత్మకత్వం అనే ధర్మం లేని రెండవ వస్తువు లేదు –అని అర్థం. బ్రహ్మను ఆత్మగా కలిగి ఉండని వేరొక వస్తువు ఏదీ లేదు –అని అర్థం. పరమాత్మను ఆత్మగా కలిగి ఉండని వస్తువు అనేది ఏదీ ఉండదు. అటువంటి వస్తువుకు సత్త ఉండే అవకాశమే లేదు. ఇది సమతాదర్శనంలోని రెండవ అంశం.

జీవాత్మలన్నీ జ్ఞానస్వరూపంగా, జ్ఞానగుణకంగా ఉండడంతో పాటు, పరమాత్మను ఆత్మగా కలిగి ఉండడం అనేది ఇంకొక ధర్మమని దీనివల్ల ఏర్పడుతున్నది. నాకు ఒకడు శత్రువు అయినా, లేక, మిత్రమైనా, లేక, అతడు తటస్థుడైనా, అతడు పరమాత్మను తనకు ఆత్మగా కలిగినవాడే. నేను ఏ విధంగా అయితే పరమాత్మకు శరీరమై ఉన్నానో, ఆ విధంగానే అతడు కూడా పరమాత్మకు శరీరమై ఉన్నాడు. ఈ సత్యాన్ని అర్థం చేసుకుంటే, ఈ సామ్యాన్ని గ్రహిస్తే, లోకంలో ఇద్దరి వ్యక్తుల మధ్య కనిపించే విరోధం అనేది వస్తుతః పరమార్థం కాదని, అది కేవలం సోపాధికమని తెలుస్తుంది. ఒకని శరీరంలోని కుడి చేయి అతని ఎడమ చేతికి విరోధిగా ఎక్కడా ఉండదు కదా. ఈ లోకంలో ఉండే జీవులందరూ పరమాత్మకు శరీర భూతులు అయినప్పుడు, ఈ జీవుల మధ్య శత్రుత్వం వస్తుతః ఉండే అవకాశమే లేదు. అందువల్లనే వస్తుస్వభావం సహజంగా ఎప్పుడు అనుకూలమైనదే అని శాస్త్రాలు తెలుపుతున్నాయి. వాని వాని కర్మానుగుణంగా ఒక వస్తువు గాని, ఒక వ్యక్తి గాని ఒకనికిఠవిరోధంగా తోచవచ్చు. అంతే. ఆయా జీవులు చేసుకున్న కర్మ ఫలాన్ని అనుసరించి ఆ విధంగా తోస్తున్నదని గుర్తించాలి. మనకు విరోధిగా తోచే ఒక వ్యక్తి మనవలె భగవంతునకు శరీరమే అని తోచినప్పుడు, ఆ శత్రుత్వం అనేది మనసులో

సమూలంగా లేకుండా పోతుంది కదా. ఇటువంటి చాలా గొప్పదైన సమతను మనకు ఉపనిషత్తు తెలుపుతున్నది. దీనివల్ల ప్రపంచంలో అంతటా శాంతి సౌభాగ్యాలు, సర్వ మానవ సౌభ్రాత్రం ఏర్పడే అవకాశం ఉన్నది.

ఈ విషయాన్నే ఉపనిషత్తు "సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానీతి శాంత ఉపాసీత" అని అంటూ ఉపదేశించింది. లోకంలో అంతట శాంతి ఏర్పడాలంటే, అందరూ ఈ జగత్తుకు, పరమాత్మకు మధ్య ఉండే శరీర శరీరి భావాన్ని గుర్తించాలి. ఈ ప్రపంచం అంతా బ్రహ్మమే, అంటే, బ్రహ్మను ఆత్మగా కలిగినదే. వేరొకరిని ఆత్మగా కలిగిన వస్తువు ఏదీ ఈ జగత్తులో లేదు. ఆ పరమాత్మ ఈ జగత్తును అంతటిని సృష్టిస్తున్నాడు, రక్షిస్తున్నాడు, తనలో లయం చేసుకుంటున్నాడు. అందువల్ల ఈ ప్రపంచం బ్రహ్మమే–అనే ఈ భావాన్ని సరిగా అర్థం చేసికొని, దానిని మనసులో మాటిమాటికి భావించినప్పుడు, మన మనసులో శాంతి కలుగుతుంది, ఎవరి పట్ల ద్వేషభావం కలుగదు, అందరి పట్ల స్నేహభావం కలుగుతుంది – అని ఈ ఉపనిషద్వాక్యం పలుకుతున్నది. నేను, పరమాత్మకు కాకుండా ఇంకొకరికి శరీరమై ఉన్నాను– అనే భావం కానీ, లేక, నాకు పరమాత్మ శరీరి కాదు, నాకు నేనే శరీరి, నేను స్వతంత్రుడను– అనే భావం కాని సరి కాదు– అని పైన ఉదాహరించిన ఉపనిషత్తు తెలియజేస్తున్నది.

ఈ విధంగా ఈ ప్రపంచంలోని చేతనాచేతనాలు అన్నీ పరమాత్మను శరీరంగా కలిగి ఉన్నాయి– అనేది ఉపనిషత్తులు మనకు ఉపదేశించిన సమతాదర్శనంలోని అతిముఖ్యమైన రెండవ అంశం.

